# అప్పకవీయం

## (తృతీయాశ్వాసం)

## వళి, ప్రాస ప్రకరణములు


-: వ్యాఖ్యాత :-

'భాషాప్రవీణ'

డా॥ శ్రీ బులుసు వేంకట సత్యనారాయణమూర్తి

ఎం.ఏ. ఎం.ఫిల్, పిహెచ్.డి





పబ్లికేషన్స్

మెయిన్‌రోడ్ - రాజమండ్రి - 1.

# అప్పకవీయం

## (తృతీయాశ్వాసం)

— వళి, ప్రాస ప్రకరణాలు —

వ్యాఖ్యాత :

"భాషా ప్రవీణ"

డా. శ్రీ బులుసు వేంకట సత్యనారాయణమూర్తి

ఎం. ఏ. ఎం. ఫిల్. పి. హెచ్. డి.

ఆంధ్రోపన్యాసకులు, శ్రీ గౌతమీ విద్యాపీఠం, రాజమండ్రి.





రోహి పబ్లికేషన్స్

మెయిన్‌రోడ్, రాజమండ్రి-1

# అప్పకవీయం
(తృతీయాశ్వాసం)

— వ్యాఖ్యాత :- డా. బలుసు వేంకట సత్యనారాయణమూర్తి
ఎం. ఏ., పి. హెచ్. డి.



ప్రథమ ముద్రణ :
నవంబర్ - 1998

వెల : రూ. 40/-

ముద్రణ :
వంశీకృష్ణ ప్రింటర్స్
విజయవాడ-2

ప్రకాశకులు :

ఫోన్ : 73444
రోహిణి పబ్లికేషన్స్
మెయిన్ రోడ్
రాజమండ్రి - 1.

భాషాప్రవీణ – సాహిత్య విద్యాప్రవీణ
రాష్ట్రభాషా ప్రవీణ
కంభంపాటి వెంకట సోమయాజులు
M.A. (తెలుగు); M.A. (సంస్కృతము); Ph.D.

# ఆ ము ఖ ము

వచనము నుండి పద్యమును--గణ, యతి, ప్రాసనియమములు వేఱు పఱచుచున్నవి. ఇతర భాషల కంటే తెలుగునకు ప్రత్యేక గౌరవము కల్గించినవి-యతిప్రాస నియమములు. యతిప్రాస విశేషములను దెల్పిన తెలుగు లాక్షణిక గ్రంథములలో "అప్పకవీయము"నకు ప్రముఖ ప్రచారము గలదు.

'ఆంధ్ర శబ్ద చింతామణి'కి పద్యరూప వ్యాఖ్యాన గ్రంథముగా ప్రారంభింపబడినను, అప్పకవీయమునకు లాక్షణిక గ్రంథము (ఛందో గ్రంథము) గానే గుర్తింపు లభించినది. ఇందలి తృతీయాశ్వాసమున, యతిప్రాసల విషయమై అప్పకవి ప్రదర్శించిన విశ్వరూపమే అందులకు కారణము. పూర్వ లాక్షణికులు చెప్పిన యతిప్రాస విశేషములను అప్పకవి పరిశీలించినాడు. ఇతర లాక్షణికులు ఎవ్వరును చెప్పనన్ని యతిప్రాస భేదములను చెప్పినాడు. తాను చెప్పిన లక్షణములకు స్వీయోదాహరణములతోబాటుగ, పెక్కు మహా కవిప్రయోగములను ప్రదర్శించినాడు. పూర్వకవిప్రయోగములు నునునిశితముగా పరిశోధించుటలో అప్పకవి చూపిన శ్రద్ధ, పడిన శ్రమ ఆదర్శముగా గ్రహింపదగినది. అంతేకాదు. పూర్వకవి ప్రయోగములను ఉదాహరించి తన లక్షణములకు అప్పకవి ప్రామాణికత్వమును సంపాదింప యత్నించినాడు.

కాకునూరి అప్పకవిని ఒక్క విషయమున ఆక్షేపింప నవకాశ మున్నట్లు తోచును. అదేమన — ప్రాసయతిని యతిభేదములలో నొకటిగా చెప్పి, ప్రాస ప్రకరణమున స్వీయోదాహరణములందు ప్రాస లకు గాక ప్రాసయతులకు ఉదాహరణల నిచ్చుట—(ప్రాసోదాహరణముల నిచ్చుట సముచితము.) అయినను ఇది అప్పకవి ప్రశస్తిని క్రించుపఱచు నది ఎంత మాత్రము కాఁబోదు.

అప్పకవీయ తృతీయాశ్వాసమునకు రెండు టీకలు ప్రసిద్ధములు గలవు. 1) ద్వివేదుల రామశాస్త్రిగారిది (వివరణము) 2) రావూరి దొర స్వామి శర్మగారిది (భావ ప్రకాశిక) విషయవిస్తృతి విరాజనములై విద్యా ర్థుల స్థాయికి మించియున్నవి. అట్టివి పండిత పరిశోధకోద్దిష్టము లన వచ్చును. పరీక్షార్థులకు అంతగా నుపయోగపడునవియే ?

వివిధ తరగతులకు పాఠ్యాంశముగా నున్న అప్పకవీయము తృతీ యాశ్వాసమునకు సుబోధకమగు లఘుటీక ఆవశ్యకమయి యున్నది. అట్టి ప్రయోజనమును నెఱవేర్చుటకు మిత్రులు Dr. B. V. S. మూర్తిగారు ప్రయత్నించిరి. రోహిణి పబ్లికేషన్సు అధినేత శ్రీ P. అప్పారావుగారు శ్రీ మూర్తిగారిని ప్రోత్సహించిరి.

ఇదివరలో చంద్రాలోకమునకు Dr. B.V.S. మూర్తిగారి చేతనే టీక వ్రాయించి శ్రీ పి. అప్పారావుగారు ప్రచురించిరి. సాధారణముగా ప్రచురణకర్తలు-నవలలు, నాటకములు మొదలగు వానివి ముద్రించి విక్ర యించుట యందు చూపునంతటి శ్రద్ధను ప్రాచీన ప్రామాణిక గ్రంథము లందంతగా చూపరు—అని లోకమున ఒక ప్రచారము గలదు. కాని శ్రీ రోహిణీ పబ్లికేషన్స్‌వారు యథాశక్తిగా ప్రాచీన ప్రామాణిక గ్రంథము లను ప్రచురించుట ఎంతయో ఆహ్వానింపదగినది. ప్రశంసనీయము కూడ.

Dr. బులుసు వెంకట సత్యనారాయణమూర్తి (B.V.S. మూర్తి) గారు సంస్కృతాంధ్ర కర్ణాటాది భాషాకోవిదులు. బహుగ్రంథకర్తలు. నిరంతర పరిశోధకులు, లబ్ధప్రతిష్ఠులు. 25 సం॥ముల పైబడి బోధనాను భవము గడించి నేటి విద్యార్థుల మానసిక స్థాయిని సక్రమ రీతిలో అవగాహన మొనర్చుకొని అధ్యాపనాతిరిక్తముగా గ్రంథకర్తృ హృదయము నావిష్కరించుటలో సిద్ధహస్తులు. వీరి టీకతోకూడిన యీ గ్రంథము పరీక్షార్థులకు అత్యంతోపకారి.

ఇంకను ఇట్టి అరుదైన-ప్రాచీన ప్రామాణిక గ్రంథములను-జన సామాన్యమునకు అందుబాటులోనికి దెచ్చుటకు మిత్రులు Dr. మూర్తి గారికి శ్రీ పి. అప్పారావుగారికి 'జగతః పితరు'లగు పార్వతీ పరమేశ్వరులు సర్వధా సర్వశక్తియుక్తులను ఆయురారోగ్య భాగ్యములను ప్రసాదింతురుగాక !

రాజమండ్రి
8-8-96

కంభంపాటి వెంకట సోమయాజులు

# ముందుమాట

ఒక మంచి పని చేయాలంటే ధైర్యం, సాహసం కావాలి మంచి పని చేయాలనే తలంపు చాలామందికి ఉండచ్చు. చేసే ధైర్యం, సాహసం కొందరికే ఉంటుంది. అలాంటి వ్యక్తి రోహిణి పబ్లికేషన్స్, అప్పారావు గారు. ఆయన కొన్ని అపురూప గ్రంథాలని తిరిగి ముద్రించి ఆంధ్ర సాహిత్య లోకానికి అందించాలనుకున్నారు. కేవలం ధనాపేక్షతోను, లాభాపేక్షతోను కాకుండా సాహిత్య సేవనమే లక్ష్యంగా కొన్ని గ్రంథాలని వీరు ఇప్పటికే ముద్రించడం జరిగింది. ఇపుడు అప్పకవీయం (తృతీయాశ్వాసం) బాల బాలికలకు సులభంగా అర్థమయ్యేరీతిలో సంగ్రహవ్యాఖ్యతో ముద్రించాలని వారి ప్రయత్నం. సాహిత్య విద్యార్థులకు ఉపయుక్తమైన ఈ గ్రంథం నేడు అనుపలభ్యం. ఏవో పాత పుస్తకాలతో విద్యార్థులు కాలక్షేపం చేసుకుంటున్నారు. మార్కెట్టులో ఈ పుస్తకం లభింపకపోవడం, సాహిత్యాభిలాషుల అభ్యర్థనం ఈ గ్రంథ ముద్రణ ప్రయత్నానికి కారణాలనుకుంటాను.

రోహిణి పబ్లికేషన్స్‌వారు నాతో విషయాన్ని ప్రస్తావించి సంగ్రహవ్యాఖ్య నొకటి వ్రాసి యిమ్మని అర్థించేరు. ఇతఃపూర్వము నేను వారికి చంద్రాలోకము శతలంకార వ్యాఖ్యను రచించి ఇవ్వడం జరిగింది. నేను వారితో ఎందరో మహానుభావులు ఇంతకు పూర్వమే చక్కని వ్యాఖ్యానాలు రచించి ముద్రించేరు గదా! మరలనిదేల ? అన్నాను. గ్రంథ రచనలోను పఠన-పాఠకాల్లోను మీకు గల విశేష అనుభవంతో విద్యార్థుల కనుకూల

మైన రీతిని, సులభగ్రాహ్యంగా సంగ్రహ వ్యాఖ్య నొకటి వ్రాసి యిమ్మని వారు ప్రార్థించేరు. ఏ గతి రచియించినా పూర్వకృతులమూలదిది అల్పము, స్వల్పమే అవుతుంది. అయిన నేల చేపట్టితినందురా? రోహిణి పబ్లికేషన్స్ వారి సహృదయత నాచే ఈ పని చేస్తాననిపించింది.

లక్షణ గ్రంధాల్లో అప్పకవీయం చాలా ప్రఖ్యాతమైన గ్రంథం. దానిని రచించినవాడు కాకునూరి అప్పకవి. అప్పకవి 17 వ శతాబ్దానికి చెందిన వాడు. తన గ్రంథం ఆంధ్ర శబ్ద చింతామణికి తెనిగింపని అప్పకవి పీఠికలో చెప్పుకున్నాడు. ఇందులో ఐదు పరిచ్ఛేదాలున్నాయి. పూర్తిగ్రంధాన్ని అప్పకవి రచించినట్లు కనబడదు. సంజ్ఞా, సంధి పరిచ్ఛేదాలు మాత్రమే అనువదింపబడ్డాయి.

సంజ్ఞా పరిచ్ఛేదంలో "ఆద్యోవళిః, ద్వితీయో వర్ణః ప్రాసః" అనే ఒక శ్లోక భాగం గ్రహించి అప్పకవి యతిప్రాస భేద వివరణతో తృతీయాశ్వాసాన్ని రచించేడు. అప్పకవి దీన్ని వ్యాకరణ శాస్త్ర గ్రంథ మన్నా లోకంలో దీనికి ఛందోగ్రంథంగానే ప్రసిద్ధి. యతి, ప్రాసలను గురించి ఇంత వివరంగా, స్పష్టంగా, లక్ష్య లక్షణ సమన్వితంగా చెప్పబడిన గ్రంథం తెనుగులో వేరొకటి కనబడదు. అప్పకవి చాల పరిశోధించి తనకి ముందున్న లక్షణ గ్రంధాల సారాన్నంతటిని ఇందులోనే బంధించేడు. అప్పకవి ఈ ఆశ్వాసంలో 41 యతి భేదాల్ని, 17 ప్రాస భేదాల్ని పేర్కొన్నాడు. సంస్కృతంలో వళి,ప్రాసలు లేవు. తెనుగు భాషకివి విశిష్టాలంకారాలు.

విద్యార్థులకి సులభంగా అర్థమవడమే లక్ష్యంగా ఈ సంగ్రహ వ్యాఖ్య ప్రారంభించేను. వివాదాంశాల జోలికి పోకుండా విద్యార్థుల ప్రయో

జనమే ప్రధానాంశంగా గ్రహించేను. ఇందుకు పరిశీలించిన గ్రంధాలనేకము లైనా, విద్వాన్ రావూరి దొరస్వామి శర్మగారిని తప్పక స్మరించాలి.

ఆయన "అప్పకవీయ భావ ప్రకాశిక" పాఠ ప్రవచనం చేసే అధ్యాపకుల కరదీపిక.

వళి ప్రాసల పరిచయం విద్యార్థులకి సులభంగా జరగాలనేదే ప్రధానం గాబట్టి ఈ సంగ్రహ వ్యాఖ్యలో దురవగాహములైన అంశాలేవైనా ఉంటే అవి నా దోషాలుగానే గ్రహిస్తాను. వానిని తెలిపి మలిముద్రణలో సవరింప చేయడం విజ్ఞులు తమ బాధ్యతగా చేకొన ప్రార్థన. సహృదయులకి సదా కృతజ్ఞుణ్ణి. కోరిన వెంటనే ఆముఖము వ్రాసి యిచ్చిన మంచి మిత్రులు శ్రీ కె. వి. సోమయాజులు గారికి అభివాదములు. ఆంధ్ర పాఠకుల ఆదరాభిమానాలే నాకు అఖండ సంపదలుగా భావిస్తానని మనవి చేస్తూ —

వ్యాఖ్యాత.

# అప్పకవీయం
## (తృతీయాశ్వాసం)

శ్రీశైల భ్రమరాంబా
ధీశేశానీ విదిఙ్మహీతల విలస
త్కాశీ సమ తంగెడనగ
రీ శమనాశా నివేశ! రిపు జననాశా! 1

శ్రీశైల భ్రమరాంబాధీశుడైన మల్లికార్జునస్వామి ఆలయమునకు ఈశాన్య దిక్కున విలసిల్లుచున్న కాశీక్షేత్రముతో సమానమైన తంగేడు సీమలో దక్షిణదిక్కున కామెపల్లి గ్రామమున వెలసియున్న శత్రుజననాశకుడవైన ఓ గోపాలస్వామీ!

(అప్పకవి ఈ గ్రంథమును కామెపల్లి గ్రామమునందలి గోపాల స్వామికి అంకితమిచ్చెను.)

క. అవధారు శబ్దశాసనుఁ
డవనిఁ గలియుగమున కాది నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పిన యాం
ధ్ర వచోవ్యాకరణ సూత్రతతిఁ దెనుఁగింతున్ 2

ఓ గోపాలస్వామీ! అవధరింపుము. కలియుగ ప్రారంభమున (సాహిత్యతపుతొలిదశకు సూచకము) శబ్దశాసన బిరుదాంచితుడైన నన్నయ్య భట్టారకుడు భూమండలమున ఆ రాజమహేంద్రవర నగరమున నుండి చెప్పిన ఆంధ్ర శబ్ద చింతామణి వ్యాకరణ సూత్రములను తెనిగించెదను.

(నన్నయ భారతముతో బాటు ఆంధ్ర శబ్ద చింతామణి కూడా రచించెను.)

క. ఇమ్ముగ వర్ణపరిచ్ఛే
దమ్మునఁ జెప్పంగఁబడియెఁ దగ నేకశ్లో
కమ్మున ముఖ్యవళి ప్రా
సమ్ములు సంక్షేపములుగ సామజవరదా! 3

ఆంధ్ర శబ్ద చింతామణియందు సంజ్ఞా పరిచ్ఛేదమునకు చివర ఒకే ఒక ఆర్యా శ్లోకమున యతిప్రాసముల గూర్చి సంగ్రహముగ చెప్పబడినవి.

చింతామణి సూత్రం:

ఆద్యో వళిర్ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు
స్వస్వచరణేషు పూర్వః ప్రాసస్సర్వేషుచైకవపస్యాత్

వ. ఈశ్లోకం బొక్కటి యొక సూత్రంబయ్యె నది యెల్ల నిందు వివరించెద. 4

తెనుగు పద్యములందు ప్రతిపాదము తొలి అక్షరము వళిఅని, రెండవ అక్షరము ప్రాసము అని చెప్పబడును. పద్యపాదములన్నింటి యందును ప్రాసాక్షర మొక్కటిగనే యుండవలెను.

(ఆంధ్రశబ్ద చింతామణిలో ఇట్లు సంక్షేపముగా ఒకే ఒక శ్లోకమున చెప్పబడిన సూత్రము నాధారముగా చేసికొని తెలుగు ప్రబంధములలోని ప్రయోగములను పరిశీలించి అప్పకవి వళిప్రాస పరిచ్ఛేదమను తృతీయాశ్వాసమును విపులముగా రచించెను.)

## యతి నిర్వచనము

చరణ చరణమున కాద్య
క్షరములు వళులయ్యె, నవియె క్రమ్మఱఁ దత్త

చ్చరణములలోనఁ జెప్పిన
యిరవులఁ బొందింపవలయు నెల్లకృతుల లోన్ 5

పద్యమున ప్రతిపాదము తొలి అక్షరము వళి అగుచున్నది.ఆ తొలి అక్షరములే ఆయా పద్యపాదములలో పేర్కొనబడిన రీతిని ఆయా స్థానములఁ నిలుపవలెను.

తే. విరతి, విశ్రాంతి, విశ్రామ, విశ్రమములు
శ్రాంతి, విరమణ, విరమ, విరామ, యతులు
ననఁగ నివి తొమ్మిదియు వళి కాఖ్యలయ్యె
భవ్యసత్ఫలాయామ్య భాగ గేహా ! 6

వళికి పర్యాయ పదములుగ తొమ్మిది చెప్పబడుచున్నవి. అవి విరతి, విశ్రాంతి, విశ్రామము, విశ్రమము, శ్రాంతి, విరమణము, విరమము, విరామము, యతి అనబడుచున్నవి.

(దీనివి బట్టి వళి అన్నను యతి అన్నను ఒక్కటే అని తెలియవలెను. సంస్కృతమున యతిస్థానమున పదవిచ్ఛేదము సరిపోవుచున్నది. "శ్లోకేషు విశ్రమస్థానం పదచ్ఛేదం యతిం విదుః" అని కావ్యాదర్శము. తెలుగున అట్లు కాక నిర్దేశింపబడిన యతిస్థానమున తొలి అక్షరముతో మైత్రిగల అక్షరమే ఉండవలయును. పదచ్ఛేదముండనక్కఱలేదు.)

క. భీమన పదిచెప్పె, శనం
తామాత్యుఁడు చేసె పెనుక యతు లిరువది నా
ల్గా మీఁదఁ గొండఱు కవి
గ్రామణు లిరువదియునేడు గావించి రొగిన్ 7

వేములవాడ భీమకవి కవిజనాశ్రయమను ఛందమున 10 యతి భేదములను, అనంతామాత్యుడు ఛందోదర్పణమున 24 యతి భేదములను, ఆపైన కొందరు కవిశ్రేష్ఠులు 27 యతిభేదములను చెప్పిరి.

(చిత్రకవి పెద్దన లక్షణ సారసంగ్రహమున 27 యతి భేదములు చెప్పెను.)

ఆ. పూర్వకవుల లక్ష్యములు సూర్చి సత్కవి
జనము లవునటంచు సమ్మతింప
విశ్రమంబు లేను విరచింతు నాలుగు
పదులమీఁద నొకటి విదితముగను 8

సత్కవిజనము అవునని సమ్మతించునట్లు పూర్వకవుల లక్ష్యములను చూపుచు 41 యతి భేదములను నేను చెప్పబోవుచున్నాను.

అక్షర సామ్యమును బట్టి యతిమైత్రి ఏర్పడును. దీనికి ఈక్రిందివి కారణములనవచ్చును.

1. సారూప్య సంబంధము : నెపము-నెవము (ప-వ), జలధి-జరది (ల-ర), హరుషము-అరుసము (హ-అ).

2. స్థానసామ్యము : క ఖ గ ఘ — కంఠ్యములు
చ ఛ జ ఝ — తాలవ్యములు
ట ఠ డ ఢ — మూర్ధన్యములు
త థ ద ధ — దంత్యములు
ప ఫ బ భ — ఓష్ఠ్యములు

3. తత్సమ తద్భవ సంబంధము : ప్రతిజ్ఞ-ప్రతిన(జ్ఞ-న), గుణము-గొనము (ణ-న), హంస-అంచ (స-చ) దిశ-దెస (శ-స).

4. వ్యాకరణ సాధ్యమగు ఆగమాదేశసంబంధము: విషము+నవ్వు =విషపునవ్వు(ము-ప),వాడు+పలికెను=వాడువలికెను (ప-వ)వెల+అలు =వెలయాలు (అ-య).

## యతి భేదములు

క. స్వరయతులు, వ్యంజనాక్షర
విరతు, లుభయవళులు, ప్రాస విశ్రాంతియు నా,
బరికింప నాల్గు తెఱఁగుల
విరమణములు వఱలుచుండు విహగ తురంగా! 9

యతులు నాలుగు విధములు 1 స్వరయతులు, 2 వ్యంజనయతులు, 3 ఉభయ యతులు, 4 ప్రాసయతి.

## I. స్వర వళులు

తే. రసను స్వరమైత్రివళులు, స్వరప్రధాన
వళులు, లుప్తవిసర్గక స్వరవళులును
ఋవళి, ఋత్వ సంబంధంబు, ఋత్వసామ్య,
వృద్ధులన స్వర వళులేడు విధములయ్యె 10

స్వరయతులేడు విధములు. 1, స్వరమైత్రివళి, 2 స్వరప్రధాన వళి, 3 లుప్త విసర్గక స్వరవళి, 4 ఋవళి, 5 ఋత్వ సంబంధవళి, 6 ఋత్వసామ్యవళి, 7 వృద్ధి వళి.

### I. స్వర మైత్రివళులు

తే. అద్వయమునకు వక్రతమ ద్వయంబు
నిద్వయమునకు ఋయుగంబు నెద్వయంబు
నుద్వయమునకు నంత్య వక్రద్వయంబుఁ
జెల్లు స్వరమైత్రివళులన శేషశయన 11

1 అ ఆ ఐ ఔలు 2 ఇ ఈ ఋ ౠ ఎ ఏలు 3 ఉ ఊ పరస్పరము యతిమైత్రినందును. (ఎఏ ఒ ఓలు వక్రములు, వక్రతమములు)

## అకార యతులు

అబ్జ వక్త్రనేత్ర ఆత్మావన చరిత్ర
ఆతతాయి జైత్ర ఐంద్ర మిత్ర
ఐందవ ప్రవగోత్ర ఔర్వశేయ స్తోత్ర
యనుచుఁ జెప్పనొప్పు యతులు కృష్ణ

తొలి మూడు పాదములందును క్రమముగా అ-ఆలకు ఆ ఐ-ఔలకు యతి మైత్రి కూర్పబడినది. ఇట్లు అ,ఆ,ఐ,ఔలు పర యతి మైత్రినందును. (ఇందు యతి స్థానమున యడాగమము యున్నను స్పష్టార్థము అచ్చుతోడి రూపమే పేర్కొనబడినది.)

## ఇత్వయతులు

ఆ. ఇందువంశసోమ ఈశ్వరీ నుతనామ
ఈడితాంగధామ ఋషభ భీమ
ఋక్షజాభిరామ ఎటులైన మాభామ
ఏఁ గటాక్షముంచి యేలుమనగ

ఈ పద్యమున నాలుగు పాదములందును వరుసగా ఇ-ఈలు ఈ-ఋలకును ఋ-ఏలకును ఎ-ఏలకును యతిమైత్రి చెప్పబడినది.

## ఉద్విరామము

౩. ఉరగ రాజశాయి ఊర్ధ్వవిష్ట పదాయి
ఊర్జితోరు కీర్తి ఒడలి కార్తి
ఒదవకుండఁ బ్రోచి ఓలిదాసునిఁ గాచి
చేరి కనక కశిపుఁ జీరితనగ 14

తొలి మూడు పాదములందును క్రమముగా ఉ-ఊలకు, ఊ-ఒలకు ఒ-ఓలకు యతిమైత్రి చెప్పబడినది.

## 2 స్వర ప్రధాన వళులు

క. తెలిసి పదాంత గతాక్షర
ములతోఁ బై శబ్దములకు మొదలఁ గలుగు న
చ్చులు గూర్చిన సంధుల క
వ్వల స్వరములే నిలుచు నుభయవళులను దక్కన్ 15

ఈ యతి అచ్చంధికి సంబంధించినది. సంధ్యక్షరమున పూర్వ పర స్వరములతో పరస్వరమునకేయతి చెల్లును. ఉభయ వళులందు మాత్రము పరస్వరముతో కూడిన పూర్వహల్లునకు యతి కూర్పవచ్చును. అది ఉభయ వళులందు చెప్పబడును.

తే. అతుల గుణధామ భాను వంశాబ్ధిసోమ
ఇనతనూభవమిత్ర లంకేశ శైత్ర
ఉరుగణకలాప శకలీకృతోగ్రచాప
నాఁగ నిట్లు స్వరప్రధాన వళులొప్పు 16

తొలి మూడు పాదములందును అ, ఇ, ఉలకు లక్ష్యములీయ బడు చున్నవి.

అ కారమునకు వంశ+ అబ్ధిలోని పరస్వరము అకారమునకు
ఇ ,, లంకా+ఈశలోని ,, ఈకారమునకు
ఉ ,, శకలీకృత+ఉగ్రలోని ,, ఉకారమునకు
యతిమైత్రి కూర్చబడినది.)

(లంకా+ఈశ యనుచో పూర్వస్వరమగు అకారమునకు ఇకారముతో యతి మైత్రి చెల్లదు.

## 3. లుప్త విసర్గ స్వరవళులు

తే. దైవభాష నదంతసాంతముల మీఁద
న(అ)త్తు మొదలను గల శబ్దమతుకు వేళ
నమరు నోత్వంబునకుఁ జెల్లున(అ)యహాలిపులు
జగతి లుప్తవిసర్గక స్వరవళులన 17

దేవ భాషయందు హ్రస్వ అకారము పూర్వమందు కల సకారాంత పదములకు ('అస్' అంతములకు) హ్రస్వ అకారము పరమగుచో ఆ రెంటి స్థానమున 'ఓ'కారము వచ్చుచున్నది. (అస్+అ=ఓ) ఆ 'ఓ'కారమునకు 'అ య హ' లతో యతి మైత్రి చెల్లును.

అనగా ఇట ఓకారముతో కాక స్వరప్రధాన వళిలోవలె పరస్వరమగు అకారముతోనే యతి చెల్లుచున్నదని గ్రహింపవలెను. అకార-ఓకారములకు మైత్రిలేదుకదా !

(పదాంత విసర్గము సకారముగను, సకారము విసర్గముగను పలుకబడుచుండును)

తే. అంబుదశ్యామ తవకింకరోహమనగ
యామినీచరగర్వతమోర్క యనగ
హరి సుతుండును నీవు నన్యోన్యమిత్రు
లయి ప్రవర్తింతు రనఁగ లక్ష్యంబులయ్యె 18

ఇందు తొలి మూడు పాదములందును

అకారమునకు (కింకరస్+అహమ్) అకారమునకు

యకారమునకు (తమస్ + అర్క) అకారమునకు

హకారమునకు (అన్య + అన్య) అకారమునకు

యతి మైత్రి చెల్లినది.

(ఇట్లు అకారము గూఢముగానున్న ఓకారముతో యతి చెల్లుచుండుటచే అనంతామాత్యుడు దీనిని గూఢ స్వరయతి యని పేర్కొనెను.)

మరున్నందన శతకమునందు :

శా. కోపాటోపము కుప్పిగంతులు నిజా కుంఠీభవచ్చార్య రే
ఖా పాండిత్యమయారె నీకును నమస్కారంబు లంకాపురీ
పాపగ్రంథి కులాంగనా కుచతటి పైఠావతద్గ్రాహి బా
హోపాటచ్చర రామదాస! తవదా సోహమ్మరున్నందనా!
**19**

పై పద్యము నాల్గవ పాదమున హకారమునకు యతి స్థానమందలి (దాసః+అహమ్) అను విసర్గ సంధిపదమున పరస్వరమగు అకారముతో యతి చెల్లుచున్నది. పైకి ఓకారమే కనపడుచున్నది.

సుభద్రాపరిణయము నందు : (విజయ విలాసము) (1–114)

శా. తాసైరింప శపర్ణయుండగ భవ ద్గర్భంబునం దాల్చి తే
జోసహ్యున్ శరజన్ముఁగాంచి యలసీ హోర క్షమా
భృత్కుమా

రీ సాపత్న్యముగన్న మోహాపుఁ బురం ద్రీ
రత్నమున్నీ వశా
వే సర్వజ్ఞున కేలనిన్నుఁ దలపై నెక్కించుకో జాహ్నవీ!
20

పై పద్యము రెండవ పాదమున (తేజః+అసహ్య) అను సంధి పదమున పరస్వరమునకు యతిస్థానమునందలి హకారముతో యతి మైత్రి చెల్లినది.

ఉద్యోగ పర్వమునందు : (1-32)

ఉ. దైన్యము దక్కి దూత యుచితంబుగఁ బాండు
నృపాలుపాలు రా
జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెదు నన్నలోక సా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద మ
నోన్య విరుద్ధభాషణము లాడినఁ దత్ఫలమాతఁడందెడిన్ 21

పై పద్యము నాల్గవపాదమున (అన్య+అన్య) అను శబ్దములో పరస్వరమునకు యతిస్థానమునందలి (భాషణములు+ఆడిన) పరస్వరమగు అకారమునకు యతి మైత్రి చెల్లినది.

## 4. ఋవళి

క. ఇత్వైత్వంబులఁ దొలగక
ఋత్వంబును ఋవళి యనఁగ రేఫముతో మి
త్రత్వంబు నెఱపునట్టి మ
హత్త్వము యట్లయగుఁ గాదు లందున్నపుడున్ 22

రిరీరెరేలకు ఋకారముతో యతిమైత్రి చెల్లును. అట్లే ఋకారము కకారాది హల్లులతో కూడియున్నను (కృ, బృ, తృ) రిరీ రెరేలతో మైత్రి చెల్లును.

(ఇచ్చట——కీడును అనుచో పాదాది ఇత్వమునకు యతిస్థానము నందలి కీలోని ఈకారముతోయతిమైత్రిచెల్లదు. కాని ఋషి-తృప్తి అనుచో కేవల ఋకారమునకు హల్లుమీది ఋకారముతో యతిమైత్రి చెల్లును. ఋకారము హల్లుతోకూడి యున్నప్పుడు హల్లునకు, అచ్చునకు కలిపి యతిమైత్రి కూర్పవలసి యుండ హల్లును విడచి ఋత్వము తోడనే ఋకారమునకు గాని, రేఫమునకుగాని మైత్రి గూర్చుట విశేషము.)

క. రతివల్లభ జనక విని
 శ్రిత కనక విలోచనాఖ్య ఋగ్యజురాది
 శ్రుతిచయ గోచర వాహీ
 కృత ఖేచర కుల లలామ రిపు జనభీమా 23

పై పద్యము రెండవపాదమున తొలియక్షరము 'రి'కారమునకు, యతి స్థానమునందలి 'ఋ' కారమునకు మైత్రి కూర్పబడినది. అట్లే నాల్గవపాదమున తొలి యక్షరము 'కృ'లోని 'ఋ'కారమునకు యతిస్థానము నందలి 'రి'కారమునకు మైత్రి కూర్పబడినది.

సభాపర్వమునందు : (2-11)

సీ. ఋత్విజుండని విచారించి పూజించితే
 ద్వైపాయనుండుండ ధర్మయుక్తి 24

పై పద్యము తొలి యక్షరము 'ఋ'కారమునకు యతిస్థానము నందలి 'రి'కారముతో మైత్రి కూర్చబడినది.

విజయ విలాసమునందు : (1-83)

ఉ. ఆణిముత్తెపుం గుముత్తెపుటొయారపు ముగ్గులు
రత్నదీపికా
శ్రేణులు ధూపవాసనలు హృద్యనిరంతర
వాద్యఘోషముల్
రాణఁ బొసంగఁ బ్రోలు మిగులం గనువిందొనరించు
నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణము నై జనులందఱు
నుల్లసిల్లఁగాన్ 25

పై పద్యము రెండవపాదమున తొలియక్షరము శ్రేలోని 'రే'కును, యతిస్థానము నందలి 'హృ'లోని ఋకారమునకును (కాదులందున్న ఋకారము) మైత్రి కూర్చబడినది.

## 5 ఋత్వ సంబంధ వళులు

తే. సొరిదిఁగాదులఁగల వట్ట సుదుల కెల్ల
ఋత్వ మిత్రంబులగునచ్చు లెనయనైదుఁ
జెల్లు హాయలును స్వరమైత్రిఁ జెందునపుడు
వెలయునివి ఋత్వసంబంధ వళులనంగ 26

కకారాది హల్లులపై నిలిచిన ఋకారమునకు ఋకారముతోను, దాని మిత్రములయిన ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏలతోను యతిమైత్రి చెల్లును. అట్లే ఇకారాదులతో కూడిన 'య, హలు' ఋకారముతో మైత్రిని పొందును. (యి, యీ, యృ, యౄ, యె, యే—హి, హీ, హృ, హౄ, హె, హే-ఋకారముతో స్వరమైత్రిగల య, హలు)

ఆ. ఇన తనూభవుండు వృషదశ్వ సుతునేసె,
ఋభునదీసుతుండు కృష్ణునేసె,
నేమి చెప్పనపుడు దృఢశక్తి శల్యుండు
హీన బలునిజేసె వృష్టికులుని 27

పై పద్యమున ఇకారమునకు వృషలోని ఋకారమునకు,
ఋకారమునకు కృష్ణులోని ఋకారమునకు,
నేలోని ఏ కారమునకు దృఢలోని ఋకారమునకు,
హీకారమునకు వృష్ణిలోని ఋకారమునకు మైత్రి
కూర్పబడినది.

జైమిని భారతమునందు : (2-109)

తే. తండ్రి తరమునఁ బెనిమిటి తరమునందు
వీసమంతయుఁ బుణ్యంబు జేసి యెఱుఁగ
వార్ధకంబున నింకేల వట్టి తొడుసు
కృష్ణు దర్శింపకున్న నా కేమి చిక్కు 28

పైపద్యము నాలుగవపాదమున కృలోని 'ఋ'కారమునకును,
కేలోని (నాకు+ఏమి) ఏకారమునకును మైత్రి కూర్పబడినది.

మనుచరిత్రమునందు ; (1-57)

సీ. తీర్థ సంవాసులే తెంచినారని విన్న
ఎదురుగా నేఁగు దవ్వైనఁ తయిన
నేఁగి తత్పదముల కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ
దెచ్చి సద్భక్తి నాతిథ్యమిచ్చు,

ఇచ్చి యిష్టాన్న సంతృప్తులఁగాఁ జేయుఁ
జేసికూర్చున్నచోఁ జేరవచ్చు
వచ్చియిద్ధరఁగల్గు వనధి పర్వత సరి
త్తీర్థ మహాత్మ్యముల్ దెలియనడుగు

పై పద్యము మూడవపాదమున ఇకారమునకు, తృలోని ఋకారమునకు మైత్రి కూర్పబడినది.

నృసింహ పురాణమున : (2-30)

సీ. ఏదేవు లీలలై యెనఁగు జగంబులు
సృష్టిరక్షా సముపేక్షఁబరఁగు 3

పై పద్యపాదమున సృలోని ఋకారమునకు, పేలో (అప+ఈక్ష ఈకారమునకు యతి మైత్రి కూర్పబడినది.

ఆముక్త మాల్యదయందు : (4-273)

హితులు భిషగ్గ్రహజ్ఞ బుధ బృంద కవీంద్ర పురోహితుల్
హితా
హితులు ధనార్జనాదినృప కృత్యనియుక్తులు వెండి కేవలా
హితులు దశాదశార్పితస మృద్ధరమాచరణేప్సు లౌట నా
హితమును నల్లెకాఁ జతుర వృత్తిఁ జరించుట నీతి జేనికిన్
31

పై పద్యమున నాలుగు పాదములందును 'హి' వర్ణమునకు, కాదులందున్న ఋకారముతో యతిమైత్రి కూర్చబడినది.

సుభద్రా పరిణయమునందు : (1-158)

తే. చెఱకు విలుకాని బారికి వెఱచినీదు
మఱుఁగుఁ జొచ్చితిఁ జేపట్టి మనుపు నన్నుఁ

ప్రాణ దానంబు కన్నను వ్రతము గలదె
యెఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార 32

పై పద్యము నాలుగవ పాదమున 'యె' వర్ణమునకు 'నృ'లోని ఋకారముతో యతి కూర్పబడినది.

ఎడవల్లి పర్వతన్నచాటుధార :

మ. రణరంగంబున నీశితాసి యరినోరంబూరిగైకొన్నఁదా
నణుమాత్రంబును వానిపైని దెగదా హా చిత్రమూహింపఁగాఁ
దృణమే కావలె దారికట్టు మొనకట్టిద్దారుణీమండలిన్
బ్రణుతప్రాభవ కందనోలి పురగోపాలా! క్షమావల్లభా! 33

పై పద్యమున మూడవ పాదమున 'తృ'లోని ఋకారమునకు 'టి' లోని (కట్టు+ఇద్దారుణీ) ఇకారమునకు యతి మైత్రి కూర్చబడినది.

## 6 ఋత్వసామ్యవళులు

తే. వట్రువలు చెంది తమలోన వ్యంజనంబు
లన్నియును గూడు ఋత్వసామ్య వళులనఁగ
వృష్ణివంశాబ్ధిసోముఁడై పృథివిఁబుట్టి
మృతుని గావించెఁ గంసునిఁ గృష్ణుఁడనఁగ 34

ఋకార సామ్యముచే హల్లులన్నియు తమలోతాము యతిమైత్రి బొందును. హల్లులకు పరస్పర మైత్రి ఉండనక్కఱలేదు.

పైపద్యమున మూడవపాదమున వృ —పృలలోని ఋకారమునకు, నాలుగవపాదమున మృ -గృలలోని ఋకారమునకు యతి కూర్చబడినది.

విష్ణుచిత్తీయమునందు : (1-41)

సీ-గీ. తిరుగుదురయారె సురపురి సురల మరిగి
బహుళ హాల హాల భరిత కల్బరిగ నగర
సగర పురవర పరివృఢ జవన యవన
పృతన భవదసి ననిఁ దెగి కృష్ణరాయ 35

పై పద్యమున నాలుగవ పాదమున పృ-కృలలోని ఋకారమునకు యతి.

అందే : (2-91)

గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగార పల్యంకికా
వహనంబో వనమాలికా కరణమో వాల్లభ్యలభ్య ధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో ప్రాగ్దీపికా రోపమో
నృహరీ వాదము లేల లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్ 36

పై పద్యమున మొదటి పాదమున గృ-శృలలోని ఋకారమునకు యతి.

## 7. వృద్ధి వళులు

క. తలకట్టులపై సంస్కృత
ములఁ గదియు పదాది వక్రములకు వరుసతో
నెలకొను వక్రతమంబుల
కిల నుభయముఁ జెల్లుచుండు వృద్ధి వళులనన్ 37

సంస్కృతమున అకారముపై వచ్చు ఏ,ఓలకు ఐ,ఔలు ఆదేశము లగును. దీనికి వృద్ధి సంధి అనిపేరు. ఇట్టి వృద్ధి సంధి విషయమున పర స్వరములయిన ఏ, ఓలకుగాని, ఆదేశములయిన ఐ, ఔలకుగాని యతి కూర్పవచ్చును.

(పరస్వరమునకు స్వరప్రధాన వళిచే యతి చెల్లుచుండ ఆదేశ స్వరమునకుకూడ యతి కూర్పవచ్చుననుట ఇట విశేషము)

తే. ఇభభయవిదార స్వరలోకైకవీర
అఖిలభువనప్రశస్తజితైణహస్త
ఉదధిజాశ్రితవక్ష భక్తౌఘరక్ష
హతపరానీక సందవ్రజౌకయనఁగ 38

పై పద్యమున
ఇకారమునకు 'కై 'లోని (లోక+ఏక) పరస్వరమైన ఏకారమునకు యతి
అకారమునకు తై లోని (జీత+ ఏణ)
ఆదేశస్వరమైన ఐకారమునకు యతి
ఉకారమునకు క్తౌలోని (భక్త+ఓఘ)
పరస్వరమైన ఓకారమునకు యతి
హకారమునకు జౌలోని (వ్రజ+ఓక)
ఆదేశ స్వరమైన ఔకారమునకు యతి

విష్ణు చిత్తీయమునందు : (4-134)

మ.గురిగుంజెం చలితుమ్మి లేదఁగిరిసా కుం దింత్రిణీపల్లవో
త్కరముంగూడఁ బొరంటి నూనియులతోఁ గట్టావి
కుట్టారికో

గిరము ల్మెక్కి తమింబసుల్పొలముహో గ్రేపుల్ మెయినా
కెరువుంగుంపటి మంచమెక్కిరి ప్రభుత్వైకాప్తి జడి

పై పద్యమున నాలుగవ పాదమున పాదాది 'కె'లోని ఎకార యతిస్థానము నందలి (ప్రభుత్వ+ఏకాప్తి)లోని పరస్వరము ఏకార యతి మైత్రి కూర్చబడినది.

విరాటపర్వమునందు : (3-32)

ఉ. ఆ కమలాక్షి రూపమహిమాతిశయంబు మనోహరంబ
గై కపరామణు ల్పురుషు లంగజుఁ డప్రతిమాన చే
స్వీకృతలోకుఁడట్లగుటఁ జేటుపురంబునవారి కెమ్మ
గా కెటులుండునిట్టి యవగాధపుఁబొత్తు మనంగవచ్చు

పైపద్యమున రెండవపాదమున పాదాది 'గై'లోని ఆదేశ మునకు యతి స్థానమునందలి లంగజులోని అకారమునకు యతిమై

భాస్కర రామాయణమునందు : (5-448)

శా. నీకంఠార్పితకాలపాశము శిరో నిర్ఘాతపాతంబు లం
కౌక స్సంచయకాళరాత్రి గళబద్ధోదగ్రకాలాహి క
న్యాకారాగత మృత్యువీజనక కన్య స్వెగనొప్పించి
కైక త్రాణుని రాముని౦గనుము నీ కీబుద్ధిగాకుండినన్

పై పద్యమున రెండవపాదమున లంకా+ఓకలోని పరస్వరము ఓ
ునకు బద్ధ+ఉదగ్రలోని పరస్వరము ఉకారమునకు యతి కూర్ప
ది.

నాలుగవపాదమున లోక+ఏకలోని పరస్వరము ఏకారమునకు
-ఈ బుద్ధిలో పరస్వరము ఈకారమునకు యతి.

్యల రాజురామభద్రుని చాటుధార :
రాజమనోజా విద్యా
భోజా దీనార్థి కల్ప భూజా రిపుసం
ఘాజా వైభవ విజిత బి
డౌజా రవితేజ గుత్తి యప్పల రాజా 42

పద్యమున నాల్గువపాదమున(బిడ+ఓజ) వృద్ధి సంధిచే వచ్చిన ఆదేశ
ఔమునకు యతి స్థానమందలి అకారమునకు యతి కూర్చబడినది.

ఇవి యేడును స్వరయతి భేదములు.

## II. వ్యంజనాక్షర విరతులు

క్రమమున ప్రాణి, వర్గజ, బిందు, తద్భవ
వ్యాజ, విశేషసమూహ్యయములు,
మహి ననుస్వార సంబంధ, ధానునాసికా
క్షర, ముపవిభక్తి, ముకారయతులు,
మొగి నవర్ణవిరామములు, ఋజు, ప్రత్యేక,
భి, న్నైకతరము, లభేదవిరతు,
లోలి నభేదవర్గోష్మవిశ్రాంతులు,
సరస, సంయుక్త విశ్రామములును,

తే. గరిమ నంత్యోష్మసంధి, వికల్పసంధి
విరమములునాఁగ వ్యంజనాక్షరవిరతులు
నిఖిలసుకవి ప్రయోగముల్ నెమకిచూడ
నేక వింశతిభేదంబు లెఱుఁగవలయు

వ్యంజనములనగా హల్లులు. వానికి గల పరస్పరమైత్రిని
ములుగ అప్పకవి తెల్పుచున్నాడు. అవి : 1 ప్రాణియతి. 2. వర్గ
3. బిందుయతి, 4. తద్భవ వ్యాజయతి, 5. విశేషయతి, 6. అన
సంబంధయతి, 7. అనునాసికాక్షరయతి, 8. మువిభక్తియతి. 9.
యతి, 10. మవర్ణవిరామము, 11. ఋజయతి, 12. ప్రత్యేక
13. భిన్నయతి, 14, ఏకతరయతి, 15. అభేదయతి, 16. అభే
యతి, 17, ఉష్మయతి, 18 సరసయతి, 19. సంయుక్తయతి, 20. అ
ష్మసంధి యతి, 21 వికల్పయతి.

## 8. ప్రాణి విరామములు

తే. ప్రాణములు నాఁగ స్వర సమాహ్వయములయ్యె
నవి కలిమిఁజేసి హల్లులు ప్రాణులయ్యెఁ
బొల్లుహల్లుల నచ్చులు పొందకునికిఁ
బ్రాణులని పల్కఁగూడదు వానినెందు

ప్రాణములనగా స్వరములు, అనగా అచ్చులు. అచ్చులు క
బడుట చేతనే హల్లులు పలుకబడుచున్నవి. కావున అవి ప్రాణులన
చున్నవి. అచ్చులు చేరని హల్లులు తమకు తాము పలుకబడవు.

అట్టి హల్లులను పొల్లుహల్లులందురు. (క్, చ్, ట్, త్, ప్) వా
ప్రాణులవి పల్కకూడదు. కేవల హల్లుకు, సర్వసహిత హల్లుకు (ప్రా
భేదము నెఱుంగవలెను.

(సంస్కృత భాషయందు పొల్లు హల్లులున్నవి అవి తెలుగులోనికి రాగానే అజంతములే యగుచున్నవి)

తే. వ్యంజనంబులు స్వరమైత్రి వలనఁ దమకు
దాము ప్రాణి విరామాభి ధానములను
జెంది మోఁదు తెలుంగులై చెల్లుచుండు
వాని నెఱుఁగక కృతిసేయ వలనుగాదు 45

వ్యంజనములు (హల్లులు) అచ్చు చేరుటచేతనే పలుకబడునవి. అట్టి హల్లులకు ఏ హల్లుతో ఆ హల్లునకు యతి చెల్లును. అట్టిసమయమున స్వరమైత్రి వళిలో చెప్పిన నియమమును కూడా పాటించవలెను. దానివలన నిది మూడు విధములగుచున్నది.

(అచ్చుతో కూడిన హల్లునకు యతిస్థానమున అదే హల్లు ఉన్నను, అచ్చునకు కూడ మైత్రి కూడిననే యతి చెల్లును. స్వరమైత్రి కూడనిచో యతి చెల్లదు.)

క. చెలులు తలకట్లు నాచా
పులు నైత్వౌత్వములు మిత్ర ములు గుడిగవయున్
సుడిగవయు నేత్వయుగమును
జెలువగు చుట్టములు ద్వివిధ శృంగౌత్వమ్ముల్ 46

హల్లుపై నున్న తలకట్టు (అకారములు) ఆ చాపులు (ఆకారములు) ఐత్వ+ఔత్వములు (ఐకార. ఔకారములు) మిత్రములు. గుడిగవ (ఇ, ఈ, లు) సుడిగవ (ఋ, ఌలు) ఏత్వయుగము (ఎ, ఏలు) మిత్రములు. ద్వివిధ శృంగ (ఉ, ఊ)లు ఓత్వములు (ఒ, ఓలు) మిత్రములు. (ఇది స్పష్టార్థము చెప్పబడినది. అమలలోని అకారమునకు, మ, ల మీదున్న అకారమునకు స్థితి భేదము నెఱుఁగవలెను. ఈ స్వరమైత్రి వ్యంజన యతులన్నిటికిని వర్తించును )

సీ. కలశాబ్ధి గంభీర కాంచనాచలధీర
కాళియోరగవైరి కైటభారి
కైలాసపతిమిత్ర కౌశికస్తుతిపాత్ర
కిల్బిషాద్రి సురేంద్ర కీర్తిసాంద్ర
కీలాలరుహనాభ కృష్ణజీమూతాభ
కృతవర్మతోఁ నేఁగి కెలఁకు లాఁగి
కెరలి చైద్యుఁడు గూడఁ గేకయుల్గొనియాడఁ
గుండినేశుని పట్టి గూడముట్టి
తే. కూర్మివల కేలసింగపుఁ గొదమలీలఁ
గొనిశతాంగంబుపై నుంచి క్రొక్కుమించి
ద్వారకకువచ్చు నీవైభవంబుఁబొగడ
శక్యమేయనఁ గాకు లక్ష్యంబులయ్యె. **47**

పై పద్యమున కకారమునకు స్వరమైత్రిని గూర్చి ఉదాహరింపబడినది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | క | కు కా తోను | | 6 | కృ | కు కె తోను |
| 2 | కా | కై | | 7 | కె | కే |
| 3 | కై | కౌ | | 8 | కు | కూ |
| 4 | కి | కీ | | 9 | కూ | కొ |
| 5 | కీ | కృ | | 10 | కొ | కో |

ఇట్లే మిగిలిన హల్లులకును స్వరమైత్రిని గూర్చి యతిని ప్రయోగింపవలెను.

## 9. వర్గజయతులు

శబ్ద సూత్రములను జగతి నేకస్థాన
సంభవంబులగుచు సంధివేళఁ
గల సవర్ణ సంజ్ఞఁ దలపోసి యతులకుఁ
గూర్పవచ్చు మఱియుఁ గొన్ని కృతుల 48

వ్యాకరణ సూత్రములందు ఒకే స్థానమున పుట్టినదగుటచే సంధి నపుడు కొన్ని హల్లులు ఆదేశాదిరూపముల నందుచున్నవి. సవర్ణతతో కూడిన అట్టి హల్లులు యతిమైత్రిని పొందును.

తమ తమ యనునాసిక వ
ర్ణములు విడిచి వెనుక లిపులు నాల్గును దమలోఁ
దమకు నరలేక నిలిచిన
సమరాహిత దమన! వర్గ యతులనఁ బరఁగున్ 49

క,చ,ట,త,ప వర్గములలో చివరి అనునాసికాక్షరములను విడచి గలిన నాలుగువర్ణములును తమలో తాము యతిమైత్రి నందును.

కంధి మధ్యగేహ ఖండతారి సమూహ
ఖంజనాభదేహ గానమోహ
గరుడపక్షివాహ ఘనవాహజ స్నేహ
భర్గవినుతి యనిన వర్గయతులు 50

పై పద్యమున క-ఖ-ఖ-గా-, గ-ఘ లకును మైత్రి కూర్చబడినది. క,ఖ,గ,ఘలు ఏకస్థానీయములగుటచే మిత్రములు.

వ. తక్కిన నాలుగు వర్గములకు ఈలాగుననే తెలిసికొనునది 51

కవర్గమునకు వలెనే మిగిలిన వర్గములకును మైత్రిని కూర్చుకొన వచ్చును.

## 10. బిందుయతులు

క. పనిఁబూని నిలుచుఁ దమతమ
యనునాసికములకు బిందు యతులను వెనుకన్
గనుపట్టు నాల్గు లిపులను
బెను సున్నలు డాసి తమకుఁ బిలుదఁగదియుచోన్ 52

వర్గములోని నాలుగక్షరములను పూర్ణబిందు పూర్వకములగుచో ఆ వర్గ పంచకాక్షరములో అనగా అనునాసికముతో యతిమైత్రిని పొందును.

తే. జ్ఞానవేద్యాయ తప్తకాంచన విభూష
ణాయ మేచక వర్ణకంఠప్రియాయ
నగధరాయ నమోస్తు సౌందర్య విజిత
మనసిజాతాయ గోపడింభాయ యనఁగ 53

పై పద్యమున జ్ఞా-ంచ, ణా-ంఠ, న-ంద, మ-ంభాలకు యతి కూర్చబడినది.

(కేవల జః ఞ శబ్దములు లేకపోవుటచే సంయుక్త వర్ణములందే ప్రయోగము.)

---

## 11. తద్భవవ్యాజ విశ్రమములు

సీ. విజ్ఞానమునకు భావింప విన్నాణంబు,
విజ్ఞాపనమునకు విన్నపంబు,
సంజ్ఞకు సన్న యజ్ఞమునకు జన్నంబు,
నాజ్ఞప్తి కానతి యాజ్ఞయాన,

యని యిట్లు సంస్కృత వ్యవహార మత్యావ,
సానంబుల ద్వితీయ సరళమునకు
నడుగునఁ గల తాలు జాను నాసికములు,
తద్భవంబున ద్రుత త్వంబు గాంచి

తే. వెలయుటను దద్భవ వ్యాజ మిశ్రమమున
జరిగి నణలకు రెంటికి జ్ఞాతసర్చ
జ్ఞానిచేతోంబుజాత శోణ కరయనఁగ
జ్ఞాతి విద్వేషి నృపనాశన కరయనఁగ 54

సంస్కృత సమములందు పదమధ్యమునగాని, చివరగాని యున్న 'జ్ఞ' కారము తద్భవమగునపుడు నకారముగా మారుచున్నది. న,ణలు మిత్రములగుచున్నవి. కావున జ్ఞతో న, ణ యతిమైత్రి పొందును.

| తత్సమము | | తద్భవము | తత్సమము | | తద్భవము |
|---|---|---|---|---|---|
| విజ్ఞానము | - | విన్నాణము | యజ్ఞము | - | జన్నము |
| విజ్ఞాపనము | - | విన్నపము | ఆజ్ఞప్తి | - | ఆనతి |
| సంజ్ఞ | - | సన్న | ఆజ్ఞ | - | ఆన |

పై పద్యము చివరి రెండు పాదములందు జ్ఞా-ణలకు, జ్ఞా-నలకు యతి కూర్చబడినది.

గణితమునందుఁబావులూరి మల్లన్న :

ఉ. శ్రీనిధియైన శివ్వనను జిమ్మననున్ మఱి సూర్యదేవునిన్
దీనిధిఁ బోలనార్యులను దేశమునన్ రవితుల్యులైన యా
సూనుల నల్వురంబడసె సూరిజనస్తుత సత్యభారతీ
జ్ఞానులఁ బద్మగర్భ వదనంబులు నాలుఁగుబోలె వారిలోన్

పైపద్యము నాలుగవ పాదమున జ్ఞా-నలకు యతిమైత్రి చెప్పబడినది
5 )

## 12. విశేష వళులు

తే. ప్రౌఢకవులు కొందఱు జ్ఞకా రంబునకును
ప్రథమవర్గంబు తొలి యక్కరములు నాల్గు
నిడుదురు ప్రబంధముల నొక్కయెడ విశేష
వళులనుచు సోమయాజులు వాడు కతన. 56

తిక్కన సోమయాజి జ్ఞ కారమునకు క కారముతో యతివివేయు టచే ప్రౌఢకవులు జ్ఞకారమునకు కవర్గములోని తొలి నాలుగక్షరములతో మైత్రి నంగీకరించిరి.

శాంతి పర్వమునందు : (4-255)

క. జ్ఞానము కేవల కృపన
జ్ఞానికి నుపదేశ విధిఁ బ్రకాశము సేయం
గానది సకల ధరిత్రీ
దానంబున కంటె నధిక తర ఫలదమగున్. 57

పై పద్యము రెండవపాదమున జ్ఞా-కాలకు యతి కూర్చబడినది.

## 13. అనుస్వార సంబంధయతులు

ఆ. ఆది పూర్ణ యుతము లై టతవర్గాక్ష
రములు తుదకుఁ గలుగు ప్రాలుదక్కఁ
బొసఁగునొకటి కొకటి భువి ననుస్వార సం
బంధ యతులు నాఁ బ్రబంధములను 58

ణ,నలు పరస్పరము మైత్రికలవగుటచే బిందుపూర్వములైన ట, తవర్గాక్షరములు పరస్పరము మైత్రి నందుచున్నవి, బిందుయతిచే పూర్ణ బిందు పూర్వములైన నాలుగక్షరములకు అనుస్వారముతో మైత్రిచెప్పబడి

నది. అనగా పూర్ణబిందు పూర్వకములయిన ట, ఠ, డ, ఢ వర్ణములు, పూర్ణబిందు పూర్వకములైన త, థ, ద, ధలతో యతి మైత్రిని పొందు చున్నవి. దీనికి అనుస్వార సంబంధమే కారణము.

మనుచరిత్రము నందు : (1-55)

శా. శీలంబుం గులమున్ శమంబు దమముం జెల్వంబు లేఁబ్రాయమున్
బోలం జూచి యితండు పాత్రుఁ డని యే భూపాలుఁడీ వచ్చినన్
సాలగ్రామము మున్నగాఁ గొనఁడు మాన్య క్షేత్రముల్ పెక్కు చం
దాలం బందు నొకప్పుడుం దలఁగ దింటం బాఁడి యుం బంటయుఁన్ 59

పై పద్యము నాలుగవపాదమున 'ందా'–'ంట' లకు యతి కూర్చ బడినది.

రావిపాటి తిప్పరాజు చాటుధార :

మ. నరిబేసై రిపుడేల భాస్కరులు భాషానాథ, పుత్రా, వసుం
ధ రయందొక్కఁడు మంత్రియయ్యె, వినుకొం డన్ రామయామాత్య భా
స్కరుఁడో, యాఁ,నయితే సహస్రకర శాఖల్ లేఁ; వదేయున్న వే
తిరమై దానముసేయుచో రిపుల హేత్రిన్వేయుచో వ్రాయుచో. 60

పై పద్యమున రెండవ పాదమున 'ంధ'–'ండ'లకు యతి కూర్చబడినది.

ఆముక్తమాల్యదయందు : (2-48)

మ.దవ ధూమంపుఁదమంబులోఁ దమరసద్రవ్యంబు వంశ్రీభా
థవ భాను ప్రతతున్ హరింపఁగుయివెంటన్ వెళ్ళుశూన్యోరుకు
హవితానంబులఁ జూడఁ జూడఁ బుడమిం బాటిల్లి పైవిప్పులై
యవనంబంచుల నాడఁగా నెగసి వాత్యాళిద్రజశ్చక్రముల్ 61

పై పద్యమున రెండవ పాదమున 'ంధ'–'ంట'లకు యతి కూర్చబడినది.

## 14. అనునాసికాక్షర యతులు

తే. అల ద్రుతంబునకును మధ్యమాను నాసి
కమునకును జెల్లు నను నాసిక యతులనఁగ
డావలను బూర్ణములు గల్గు ట ఠ డ ఢ లును
త థ ద ధ లును గ్రమంబున దానవారి 62

పూర్ణ బిందుపూర్వకములైన ట,ఠ,డ,ఢ,లు 'న'కారముతోను, పూర్ణబిందు పూర్వకములయిన తథదధలు 'ణ'కారముతోను యతి మైత్రి పొందును.

(బిందు యతికి దీనికి భేదము గ్రహింపవలెను. బిందుయతిలో ఆ

వర్గములోని నాలుగక్షరములు పూర్ణ బిందుపూర్వములై అనునాసికముతో మైత్రి పొందుచున్నవి. ఇందు పూర్ణ బిందు పూర్వక 'త' వర్గము 'ణ' కారమునకు పూర్ణ బిందుపూర్వక 'ట' వర్గము 'న' కారమునకు చెల్లునని చెప్పబడినది)

క. మను సంతతి మండన భం
డన నిర్జిత కార్తవీర్య నర నాయక ఖం
డన పంక్తి స్యందన నం
దన చందన శక్రవారణ లసత్కీర్తీ. 63

పై పద్యము రెండవ పాదమున
'ండ' కారమునకు-'న' కారముతోను
'ంద' కారమునకు-'ణ' కారముతోను యతి.

కిష్కింధా కాండమునందు : (6 14)

క. బలవంతుఁడైన వాలికిఁ
దలఁకుచుఁ గిష్కింధ వెడలి త్వరలో నలు ది
క్కులకుం బాటి మహిమం,
డల మెల్లను జూచినాఁడ నాఁడు నరేంద్రా 64

పై పద్యమున నాలుగవ పాదమున 'ండ'—'నా'లకు యతి.

రాజశేఖర చరిత్రమునందు : (2-127)

మ. కలమాన్నంబు ఘృతంబుఁ బాయసము శాకవ్రాతముల్ పిండి వం
టలు పాత్రేనియ జున్ను వెన్నయిడి లూ నాలుకెక్కర ల్చకెక్కరల్

ఫలముల్ పానకముల్ రసాయనము లం బళ్యారుఁ
బిండ్లూరుఁ
యలు బజ్జుల్ దధి పిండఖండములు నం దావిర్భవించె
న్వెనన్

పై పద్యమున రెండవపాదమున 'ంట'-'నా'లకు యతి.

పరమయోగి విలాసమునందు : (2-104)

సీ. నిగమ చోరకుని ఖం డించిన యలఁతయో
యబ్ధిలో గిరిమోచి నట్టి యలఁతో

పై సీస పద్యపాదమున 'ని'-'ండి'లకు యతి.

చిత్ర భారతమునందు :

తే. నకుల సహదేవులార భం డన పటిష్ఠు
లార సౌందర్య లక్ష్మికు మారు లార
పోయితిరె మీరు నేఁడు నా పొందు విడిచి
యనుచు విలపించు నలుదిక్కు నాలకించు 67

పై పద్యము తొలిపాదమున 'న'-'ండ'లకు యతి.

హరిశ్చంద్రోపాఖ్యానమునందు : (1-8)

సీ. వల్లవారుణ జటా పటల భారముతోడ
నవ్య పలాశ దండంబు తోడ 68

పై సీసపద్యపాదమున 'వ'-'ండ'లకు యతి.

## 15. మువిభక్తి యతులు

తే. పున్నపుంసక తత్సమంబుల కడపలఁ
దత్సమాంధ్రదేశ్య శబ్దముల తుదలఁ
గదిసిన మకార శృంగముల్ కావ్యములను
బొసఁగు ముక్తి యతులని 'పుఫుబుభులకు 69

తత్సమదేశ్య శబ్దములకు ప్రథమావిభక్తి 'ము'ప్రత్యయము చేరుచున్నది. ఆ 'ము' కారమునకు 'పు-ఫు-బు-భు'లతో యతి మైత్రి చెల్లును.

(బిందుయతి ననుసరించి పూర్ణబిందు పూర్వకములైన 'ప' వర్గాక్షరములు 'మ'కారముతో మైత్రినందుచున్నవి. బిందువు లేకుండగనే 'పుఫుబుభు'లు 'ము'విభక్తితో మైత్రి నందుట ఇక్కడ చెప్పబడినది. ముక్తికి 'ఉ'కార మిత్రములయిన 'ఊ,ఒ,ఓ'లు కల 'ప' వర్గముతోకూడ యతి మైత్రి నందునని గ్రహింపవలెను.)

తే. పుష్కరము సూక్ష్మ మధ్యము ముగ నొనర్చె
ఫుల్లపంకేరుహాము వృత్తి ముగ నొనర్చె
బొండుమల్లెలు దరహాస ముగ నొనర్చె
భోజనృపనందనకు నిక్క ముగ నజుండు 70

పై పద్యమున 'పు-ములకు, 'ఫు-ములకు', 'బొ-ము'లకు "భో-ము" లకు యతి-

ఆది పర్వమునందు: (5-58)

క. ఎట్టి విశిష్ట కులంబునఁ
బుట్టిన సదసద్వివేక ములు గలిగినఁదాఁ
గట్టిన కర్మఫలంబులు
నెట్టన భోగింపకుండ నేర్తు రె మనుజుల్ 71

. పై పద్యము రెండవ పాదమున 'బు-ము'లకు యతి.

## 16. ముకార యతులు

క. హెచ్చరికను పు ఫు బు భు లకు
నచ్చపు మాకొమ్ములే మహాకవులాదిన్
మెచ్చులుగ నిలిపి రచ్చట
నచ్చటను ము కారయతుల టంచును గృతులన్

మహాకవులు కొన్ని యెడల విభక్తి ముకారమునకేకాక కే
కారమునకు కూడ 'పుపుబుభు' లతో యతిమైత్రి నంగీకరించిరి.

(కవిత్రయ భారతము ఈ యతి నంగీకరింపలేదని, అర్వా
గీకరించుటచే వేరు యతిగా దీనిని అప్పకవి చెప్పెనని యెఱు
కావుననే స్వీయలక్ష్యము విట ఈయలేదు)

నాచన సోమన వసంత విలాసమునందు :

క. అత్తఱి విట నాగరకులు
చిత్తమున వసంతకేళి చిగురొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి
ముత్తెపు ఝల్లరులతోడి బుట్టట కొమ్మల్.

పై పద్యము నాలుగవ పాదమున కేవల ము కారమునక
కారముతో యతి.

శ్రీకంఠమాహాత్మ్యమునందు :

చ. పరిచరుఁ గాఁగ నేలె నిర పాయ చరిత్రునిఁ జాప శా
స్ఫురదురు పీతిహోత్రుని స ముజ్జ్వలమేరుసమానగాత్రుః
బరమ పవిత్రునిన్ మునిసు పర్వవరస్తుతి పాత్రునిన్ మ
హారఫలశేముషీ కబలి తాంబుజ మిత్రుని వాయుపుత్రుని

పై పద్యము రెండవ పాదమున 'స్పు' లోని పు వర్ణమునకు-మువర్ణమునకుయతి.

హరిశ్చంద్రకధయందు :

ద్విపద. ముందు మీరెఱిఁగిన భూతలాధీశు
లందు రాజ్యంబుఁ బో నాడి క్రమ్మఱను. 75

పై పద్యము మొదటి పాదమున 'ము-భూ'లకు యతి.

## 17. మవర్ణ విరామములు

సీ. మర్దితదైత్య సం యమి మనోజ్ఞాదిత్య
మహితమేఘాభ సం రక్షితేభ
మాయాప్రవర్తి సం లబ్ధ నిర్మలకీర్తి
మణిహార సుర వశం వదవిహార
మందర ధైర్య వం శరినాద చాతుర్య
మాభూప యువతి పుం షండ రూప
మంజులస్వాంత కం స ధరావర కృతాంత
స్మరహ రారాధ్య సిం హనిభమధ్య

తే. యనుచుఁ జరమాను నాసికం బునకు నిట్లు
గ్రాలుఁ గృతుల మవర్ణవి రామములన
దండిసున్నలు దాపల నుండెనేని
పెలుచ నంతస్థములు సూష్మ ములును గృష్ణ. 76

పూర్ణబిందు పూర్వకములయిన అంతస్థములు (య, ర, ల, వ) ఊష్మములు (శ, ష, స, హ) చరమాను నాసికము (మకారము)తో యతి మైత్రి నందును.

పై పద్యమున
1. మ –ంయ
2. మ –ంర
3. మా–ంల
4. మ –ంవ
5. మ –ంశ
6. మా–ంష
7. మ –ంస
8. 'స్మ'లోని మ–ంహ లకు యతి.

భీమన చాటుధార :

చ. గరళపు ముద్ద లోహ మవ–గాఢ మహాశని కోట్లు
నమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపుకోరలు పట్టుకార్లు ది
క్కరటి శిరంబు దాయి లయ–కాలుఁడు కమ్మరి వైరి
వీర సం
హరణ గుణాభిరాముఁడగు–మైలము భీమన ఖడ్గసృష్టికిన్

పై పద్యము నాలుగవ పాదమున 'ంహ–మై'లకు యతి.

అనంతుని ఛందమునందు : (1-117)

తే. యరలవలు శషసహలును నాదిబిందు
యుతములై మకారవిరామ యుక్తిఁదనరు
మారుతాత్మజుఁడరిది సంయమి యనంగ
మదన జనకుఁడు దనుజ సంహారుఁడనఁగ. 78

పై పద్యము మూడవ పాదమున 'మా-ంయ' 'మ-ంహ' లకు యతి.

## 18. ఋజుయతులు

తే. మొదలియంతస్థ వర్ణంబు తుదిని బొదలు
ఘూష్మమును ఋజుసంజ్ఞచే నొకటికొకటి
యతులగు నపారశూర సంహార యనఁగ
హారముఖార్చితపాదతో యజయనంగ. 79

మొదటి అంతస్థ వర్ణము (యకారము) చివరి ఊష్మవర్ణము (హకారము)తో మైత్రి నందును.

(ఈ యతి సరసయతి చేతనే సాధ్యమగుచున్నది. వేరుగా చెప్పుట నృష్టారము.)

పై పద్యము మూడవ పాదమున 'య-హా'లకు
నాలుగవ పాదమున 'హ-య'లకు యతి.

## 19. ప్రత్యేకయతులు

తే. ఉత్తరపదాద్యలిపి లోప మొదవకుండు
తతిని ప్రత్యేక యతి నాఁగఁ దనరుచుండు,
నరయ శార్ఙ్గంబు హరిచేతి యదియునాఁగ
దివ్యచాపంబు శూలిచేతిది యనంగ. 80

సమాసమున అది, అవి శబ్దముల అత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా వచ్చుచున్నది. చేతి+అది-'చేతిది' అగుచున్నది. లోపము లేనిచో యడాగమము వచ్చి 'చేతియది' అగుచున్నది. లోపమువచ్చిన హల్లుతోడను, లోపమురానపుడు అకారముతోను యతి చెల్లును.

('చేతిది'లోని గూఢ అకారమునకు యతి చెల్లునని చెప్పుననే ఈ యతి ప్రత్యేకత యుండును. లేకున్న ఈ యతి వేరుగా చెప్పనక్కర లేకయే సిద్ధించుచున్నది.)

## 20. భిన్నయతులు

తే. గురుసుపైఁ గ్రియనడుమ నా గురుసువచ్చి
భిన్నయతియగు, రానిచోఁ బెఱయతియగుఁ
నెదనులచ్చిని హారిధరి యించెననఁగ
రిపులనెల్లను బోర హరించెననఁగ.

కొన్ని ధాతువులకు ఇంచుగాగమము చేసినపుడు యించు' అను విధముగా రెండు రూపము లేర్పడుచున్నవి. యికారమునకు ఇకార సవర్ణాచ్చులతో యతి మైత్రికూర్చిన అది 'ధరించు' రివర్ణమునకు యతి కూర్చిన అదిపెఱయతి.

(ధరించు, హరించులో నిగూఢ ఇకారమునకు య ప్రయోగముల కానంబడుచున్నది. అట్లు వ్యంజన, స్వరమైత్రు ఉభయ యతిగ చెల్లుట సమంజసమేయగును.)

పై పద్యమున మూడవ పాదమున 'నె'లోని 'ఎ' కు యికారములో భిన్నయతి.

నాలుగవ పాదమున రి-రి లకు పెఱయతి.

విజయవిలాపమునందు : (3-15)

ఉ. చిత్తజుఁడల్గి తూపు మొనఁ జేసినఁ జేయుఁగని:
బైత్తిన నెత్తనిమ్మ వచి యించెదఁ గల్గినమాట
నత్తరళాయతేక్షణ కటాక్ష విలాసరసప్రవాహః
కుత్తుక బంటి తామరుల కుందలమునక్కల్లు
గండుమీలకున్.

పై పద్యము రెండవ పాదమున 'బె'లోని ఎకు-యికు భి:

అందే :

ఉ. చెట్టతనంబునన్ జనకు జీవనమంతయు వెల్లివుచ్చితోఁ
బుట్టినయాపె యిల్వెడలిచి పుట్టిన బిడ్డనికిం బగైనసీ
యిట్టి నిశాటకృత్యమున కెవ్వడు రోయక సమ్మతించు నీ
వెట్టి ప్రదోషవేళ జనియించిన వాఁడవొ గాక చంద్రమా

పై పద్యము నాలుగవ పాదమున 'వె'లోని ఎకు-యికు భిన్నయతి.

ఆగమము రానందులకు శ్రీరంగమాహాత్మ్యమునందు :

ఉ. గందపుఁగొండ నెత్తములఁ గండువమేలిమితీవ యిండ్లలోఁ
గెందలి రాకుపాన్పున సుఖించి నిశాంతరతి శ్రమంబు మం
జెందిన చెంచుగుబ్బెతల చెక్కులఁజిమ్ము జవాదివాసనల్
విందులుసేయుచున్మలఁగు వేఁకువఁ గోమలగంధవాహముల్. 84

పై పద్యము రెండవ పాదమున గె-ఖిలకు పెఱయతి.

## 21. ఏకతరయతులు

తే. మహిని రేఫాక్షరంబును మఱి శకారాంగ
నామక అకారమును సవర్ణంబులయ్యుఁ
గావ్యములయందు నొకటికొకటి గలయక
తమకునుండామయగు నేకతరయతులన. 85

ర-ఱ (లఘ్వలఘురేఫములు) (సవర్ణము)లైనను పరస్పరము యతి మైత్రినందవు. ఏ వర్ణము ఆ వర్ణముతోనే మైత్రినందును. రెండవ వర్ణముతో మైత్రి పొసగదు.

ఆ. రారబాలకృష్ణ రచ్చలగమిఁగూడి
జూఁగయనుచు నిన్ను జవ్వఁబెట్టు
వాండ్రయిండ్ల కేఁగి వాదేల దెచ్చెద
వనిన నేకతరము లై పొసంగు.

పై పద్యము తొలిపాదమున రా-ర లకు యతి
రెండవ పాదమున జూ-జ లకు యతి

## 22. అభేద విరతులు

తే. వేదముఖమున 'వబయోరభేద' యనుట
వలన వబలొక్కటొక్కటి నిలుచు విరతి
కవని లడలకు, లళలకు నట్లు కలిమిఁ
జేసి తమలోన నివియును జెల్లుచుండు

వ-బ లకు, ల-డ లకు, ల-ళ లకు అభేదత్వము చెప్పబడి నందువలన అది పరస్పరము యతి మైత్రినందును.

(వ బ లకు వలెె రల, లడ లళ, శస, నణ మొదలైనవి చేయుచున్నవి. శ స లకు, ఊష్మయతి చెల్లుచున్నది. న ణ ల యతి చెల్లుచున్నది. వ-చ, ల-డ, ల-ళ లకు అభేద విరతి చెల్లు ర-ల మైత్రి అప్పకవి అంగీకరింపలేదని గ్రహింపవలెను.)

ఆ. వసుమతీకళత్ర బకవైరి చైత్ర గానక
లాలనత్కలాప డంభ గోప
లలితదేహ పింగళపుర దక్షిణగేహ
యన నభేద విరతు లప్రమేయ.

పై పద్యమున తొలిపాదమున వ-బ లకు
రెండవ పాదమున లా-డ లకు
మూడవ పాదమున ల-ళ లకు యతి.

ఆదిపర్వమునందు : (4–94)

చ. నుతజలపూరితంబులగు నూతులు నూటికంటె సూనృత
వ్రతయొక బావిమేలు మఱి బావులు నూటికంటె నొక్కస
త్క్రతువది మేలువత్క్రతు శతంబునకంటె సుతుండుమేలు త
త్సుత శతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు చూడఁగన్. 89

పై పద్యమున రెండవ పాదమున వ్రలోని వ-బా లకు యతి.

అరణ్య పర్వమునందు (1–311)

చ. ప్రతిబలదర్పభంజనుఁడు పార్థుఁడు దారుణబాణ వర్షము
న్నతి నతిధీరుఁడై కురిసి నంబరముందు మహాంబువృష్టి ప
ర్వతము గ్రసించునట్లు తన బాహుల వానిగ్రహించి పోర న
క్షత తనుఁడయ్యె వాని నతి గర్వితుఁ బార్థుఁడు చూచి యాత్మలోన్. 90

పై పద్యమున మూడవ పాదమున ర్వలోని వ-బా లకు యతి.

భీమనచాటుధార :

ఉ. బిసరుహగర్భు వ్రాఁతయును విష్ణుని చక్రము వజ్రివజ్రమున్
దెసలను రాముబాణము యుధిష్ఠిరుకోపము గాలుదండమున్

మసకవు పాముకాటును గుమారునిశక్తియు
మానిరోషమున్
బసవని కౌతుశూలమును బండితవాక్యము రిత్తవోవునే 91

పై పద్యమున మొదటి పాదమున బి–వి లకు యతి.

చమత్కారమంజరియందు :

ఉ. బంగరు దుప్పటంబువలె వాటుగనొప్ప హసన్ముఖాబ్జుఁడై
రింగున నారిఁగోల నమరించి తటాలునఁ ద్రుంచె నా
ధను
శ్చంగుఁడు గోపయూవతభుజంగుడు మోచితసంగుఁడుం
గృపా
పాంగుడు దృప్తదర్పబల భంజనయంత్రము మత్స్య
యంత్రమున్. 92

పై పద్యమున మొదటి పాదమున 'బ-వా' లకు యతి.

తే. పెద్ద లాకును దనకు న భేదమగుట
లళ లకు నభేద మట్లన కలుగు కతన
క్షితిని మూఁడవ సరళంబు యతులఁ బ్రాస
ములను లఘ్వలఘు లకార ములకు నిలుచు. 93

పెద్ద లా (ళకారము)కును, డ కారమునకును అభేదమున్నది. ల, ళ లకు అభేదమున్నది. కావున డ, ళ, ల లకు అభేదయతి చెల్లును.

(మీది ఉదాహరణమునుబట్టి ప్రాస యందును చెల్లునవి గ్రహింపవలెను.)

అనంతుని ఛందమునందు డ-శ లకు : (1–95)

క. కాకు స్వర యతి యగు నిత్య
డే కదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్ర
శ్నాకలిత దీర్ఘమున నితఁ
డే కవ్వడి రథముఁగడిపె నిమ్మల ననఁగన్ 94

పై పద్యమున రెండవ పాదమున 'డే-శ' లకు యతి.

ఆదిపర్వమునందు 'ల-శ' లకు : (4-42)

అలసత నోరగాఁ దరుణి యమ్మునిపుంగవు బ్రోలనున్న నా
మిళిత సుగంధ బంధుర సమీర వశంబునఁ దూలి బాలపై
వలు వెడల న్బయల్పడియె నల్లకుచంబులుఁ గక్షయుగ్మమున్
లలిత కృశోదరంబుఁ దరళత్రివళీయుతరోమరాజియున్ 95

పై పద్యమున నాలుగవ పాదమున 'ల-శ' లకు యతి.
తొలి రెండు పాదములందును 'ల-శ'లకు ప్రాసమైత్రియు కూర్చబడినది.

నిర్వచనోత్తర రామాయణమునందు : (1-26)

శా. చేసేతం బృథివీశు లందుకొనఁ గా శ్రీ పుణ్యతో యంబునన్
జేసెన్మజ్జన ముంగుటంబున మారిం చెన్ బల్లవోర్వీశు ను
ల్లాసంబై తగ ఫాలలోచనము లీ లంగట్టెఁ గా వేరి వే
లాసాధ్యాఖిల దిఙ్ముఖుండు కలికా లక్ష్మా విభుం డల్పుఁడే. 96

పై పద్యమున నాలుగవ పాదమున 'లా-శ' లకు యతి.

ద్రెళ్ళఁగ సర్పయాగ మతి ధీయుత సేయుము
విప్రసమ్మతిన్. 99

పై పద్యమున మూడవ పాదమున 'వ-ప' లకు యతి.

అందే : (2–172)

క. ఉరగ కళేబర మంసాం
తరమునఁబడి వ్రేలుచునికిఁ దలఁపక యచర
స్థిరుఁడై పరమధ్యానో
వరతేంద్రియవృత్తి నున్న వాని శమీకున్. 100

పై పద్యమున నాలుగవ పాదమున 'ప-వా' లకు యతి.

క. కోరి యనేక యుగంబు ల
పారతపోయుక్తులైన వారికిఁ బడయన్
దూరము నీసభ మఱి నీ
కారుణ్యము నంతకంటెఁ గడు దవ్వొందున్. 101

పై పద్యమున రెండవ పాదమున 'పా–వా'లకు యతి.

ఫకారమునకు సాంబోపాఖ్యానమునందు :

క. మురసంహరునాటోప
స్ఫురణమ్మునకున్ సదాశివుండైన రణ
స్థితి నిలువఁగలఁడె బాణా
సురునకుఁ దోడుపడవచ్చి సొలయుట వినరే. 102

పై పద్యమున రెండవపాదమున 'స్ఫులోని ఫు-వు'లకు యతి.

ద్రెళ్ళఁగ సర్పయాగ మతి ధీయుత సేయుము
విప్రసమ్మతిన్. 99

పై పద్యమున మూఁడవ పాదమున 'వ-ప' లకు యతి.

అందే : (2–172)

క. ఉరగ కళేబర మంసాం
తరమునఁబడి వ్రేలుచునికిఁ దలఁపక యచర
స్థిరుఁడై పరమధ్యాని
వరతేంద్రియవృత్తి నున్న వాని శమీకున్. 100

పై పద్యమున నాలుగవ పాదమున 'ప-వా' లకు యతి.

క. కోరి యనేక యుగంబు ల
పారతపోయుక్తులైన వారికిఁ బడయన్
రారము నీసభ మంటి నీ
కారుణ్యము నంతకంటెఁ గడు దవ్వెందున్. 101

పై పద్యమున రెండవ పాదమున 'పా—వా'లకు యతి.

ఫకారమునకు సాంబోపాఖ్యానమునందు :

క. మురసంహారునాటోప
స్ఫురణమ్మునకున్ సదాశి వుండైన రణ
స్థిత నిలువఁగలఁడె బాణా
సురునకుఁ దోడుపడవచ్చి సొలయుట వినరే. 102

పై పద్యమున రెండవపాదమున 'స్ఫులోని ఫు-వు'లకు యతి.

ఆదిపర్వమునందు : (8-29)

మ. త్త. ధీరులీధృతరాష్ట్రపాండుల తిరస్కృతగుణుల్ప్రసి
ద్ధోరు కీర్తులు నాకు నిద్దఱు నొక్కరూప తలంపఁగా
వీరువారనునట్టి బుద్ధి వి భేద మెన్నఁడు లేదుఁ గాం
ధారిపుత్త్ర శతంబునందుఁ బృథాతనూజుల యందునన్.

పై పద్యమునందు మూడవపాదమున 'వీ-భే'లకు యతి.

## 24. ఊష్మవిశ్రాంతులు

తే. అంత్యవర్ణంబుఁ బాసి యూష్మాక్షరంబు
లూష్మవిశ్రాంతులనఁ జెల్లు నొకటి కొకటి;
శతమఖోపల భూపాను షంగ యనఁగ
షడ్జయుత వేణునాద ప్రసంగ యనఁగ. 104

శ, ష,స అను మూడు ఊష్మాక్షరములు పరస్పరము యతి మైత్రి నందును. 'హ' కారమునకు ఈ మైత్రి చెల్లదు.

(క్రింద సరస వడిలో ఈ మైత్రి చెప్పబడుచుండ ఈ యతివేరుగా చెప్పుటలోని ప్రయోజన మగపడదు)

పై పద్యమున మూడవపాదమున 'శ-ష' లకు యతి.
నాలుగవపాదమున 'ష-స' లకు యతి.

## 25. సరసవళులు

క. హయలత్వమునకు, శషసలు
నయవర్తన చఛజఝలకు, నలి మధ్యమ వ
ర్గయుతానునాసికము ని
శ్చయముగ ద్రుతమునకుఁ జెల్లు సరసవళులనన్. 105

ఈయతి మూడు విధములుగా చెల్లుచున్నది. 1 అకారమునకు హ, యలతో యతి చెల్లును. 2. శ,ష,సలకు చ,ఛ,జ,ఝలతో యతి చెల్లును. 3. మధ్య మవర్గముకానునాసికము (టవర్గాంతానునాసికము) ణకారమునకు నకారముతోను యతి మైత్రి చెల్లును.

తే. హరిహయాది సురాధ్యక్ష అంబుజాక్ష
యతి జనమనోంబుజ విహార అఘవిదూర
నరకదైత్యవిరోధి ఘృణాపయోధి
యనఁగ సరసాఖ్యవళ్యుదాహరణములగు. 106

పై పద్యమున మొదటి పాదమున, 'హ-అ'లకు
రెండవ పాదమున, 'య-అ'లకు
మూడవ పాదమున, 'న-ణా'లకు యతి.

తే. శకటదానవ సంహారి చక్రధారి
షట్పదశ్యామమూర్తి స్వేచ్ఛాప్రవర్తి
స్వర్ణ పటపరిధాయి భుజంగశాయి
కరుణననుఁ బ్రోవు మనసయ్యె సరసవళులు. 107

పై పద్యమున మొదటి పాదమున 'శ-చ'లకు
రెండవ పాదమున 'ష-ఛా'లకు
మూడవ పాదమున 'స్వలోని స-జ' లకు యతి కూర్చబడినది.

## 26. సంయుక్త విశ్రామములు

ఆ. ఒకటి రెండు జడ్డ లుండెడు వర్ణంబు
విశ్రమస్థలమున వెలసెనేని

యవలదాని కెద్ది యైన సంయుక్త వి
శ్రామసంజ్ఞ చేఁ బొసంగుచుండు. 108

జడ్డ (సంయుక్తవర్ణము) యతి స్థానమందున్న అందలి ఏ హల్లు తోనైనను యతి వేయవచ్చును. అన్ని హల్లులకు మైత్రి కూర్చనక్కఱ లేదు.

తే. క్ష్మాధరం బాతపత్త్రింబు గా ధరించె
క్ష్మాకుమారుని బోరను సంహరించె
క్ష్మారుహాంబునకై నిలింపవతి నొంచెఁ
జక్రియనిన సంయుక్త విశ్రామములగు. 109

పై పద్యమున 'క్ష్మ' క,ష,మల సంయుక్త వర్ణము. వానికి వరుసగ యతి మైత్రి చూపబడుచున్నది.

తొలి పాదమున 'క్ష్మ-గా'లకు (వర్గయతి)

రెండవ పాదమున 'క్ష్మ- స'లకు (ఊష్మయతి)

మూడవ పాదమున 'క్ష్మ-ంప'లకు (బిందుయతి) కూర్చబడినది.

## బహుయతి నియతి

క. ఏకపదంబున విరతు ల
నేకంబులు గలిగియుండు నేని పదాదిం
జేకొన్న లిపియె యన్నిటఁ
బ్రాకటముగ నిలుచు సీస పదములఁ దక్కన్. 110

ఒక పాదముననే అనేక యతులుండుట స్రగ్ధరాది వృత్తములలో సంభవించుచున్నది. అట్టి సందర్భములలో సంయుక్తాక్షరమునందలి ఏ హల్లుతో తొలి యతి కూర్చుదుమో ఆ హల్లుతోనే మిగిలిన యతులను కూర్చవలెను. సీసపద్యమునందు పాదమును రెండు సగములుగా చేసి

ఐదటి అక్షరమునకు మూడవ గణము మొదటి అక్షరమునకు యతి
ఁర్చుట నియమము.

కావున సీసపాదములకు ఈ నియమము వర్తించదు.

. ఒక్కపదములోనఁ బెక్కు విశ్రమములు
జఱుగుచోట మొదల జడ్డలున్న
నడుగు వెడలు దనుక నం దొక్కటియ కాని
యుండ దొకట నదియు నొకట నిదియు. 111.

ఒకపాదముననే అనేక విరతులుండు నప్పుడు మొదటి సంయుక్తా
రమున్న అందు ఒక హల్లుతోనే అన్ని యతులను కూర్పవలెను కాని
కటి ఒక హల్లుతోను, వేతొకటి మఱియొక హల్లుతోను కూర్పరాదు.
ఇది స్పష్టార్థము.)

(స్రగ్ధర, మహాస్రగ్ధర, మానిని, కవిరాజ విరాజితము, సరసిజము,
ంచపదము, మంగళమహాశ్రీ, తరువోజ, విజయ భద్రరగడ, విజయ
ంగళరగడ మున్నగునవి అనేక యతులు 2 ఛందములు.)

యభద్రరగడ :

క్ష్మాపుత్రికాలోల కమనీయ గుణజాల
ఘననీలయనిచెప్పఁ గా బహు విరతులొప్పు.
క్ష్మాపాలకలలామ కంధిగర్వవిరామ
సంగ్రామ భీమ యన మహిని రెంటికిఁదప్పు. 112

విజయభద్రరగడలో 8 పంచమాత్ర గణములుండును. 1, 3, 5,
గణముల తొలి అక్షరములకు యతిమైత్రి కూర్పవలెను.

పై పద్యమున తొలిపాదమున 'క్ష్మలోని కకారమునకు—క,ఘ,గా
క్తో' యతి కూర్పబడినది.

మొదటి అక్షరమునకు మూడవ గణము మొదటి అక్షరమునకు యతి కూర్చుట నియమము.

కావున సీసపాదములకు ఈ నియమము వర్తించదు.

ఆ. ఒక్క పదములోనఁ బెక్కు విశ్రమములు
జరుగుచోట మొదల జడ్డలున్న
నడుగు వెడలు దనుక నం దొక్కటియ కాని
యుండ దొకట నదియు నొకట నిదియు. 111.

ఒకపాదముననే అనేక విరతులుండు నప్పుడు మొదటి సంయుక్తాక్షరమున్న అందు ఒక హల్లుతోనే అన్ని యతులను కూర్పవలెను కాని ఒకటి ఒక హల్లుతోను, వేఱొకటి మఱియొక హల్లుతోను కూర్పరాదు. (ఇది స్పష్టార్థము.)

(స్రగ్ధర, మహాస్రగ్ధర, మానిని, కవిరాజ విరాజితము, సరసిజము, క్రౌంచపదము, మంగళమహశ్రీ, తరువోజ, విజయ భద్రరగడ, విజయ మంగళరగడ మున్నగునవి అనేక యతులు 2 ఛందములు.)

జయభద్రరగడ :

క్ష్మాపుత్రికాలోల కమనీయ గుణజాల
ఘనసీలయనిచెప్పఁ గా బహు విరతులొప్పు.
క్ష్మాపాలకలలామ కంధిగర్వవిరామ
సంగ్రామ భీమ యన మహిని రెంటికిఁదప్పు. 112

విజయభద్రరగడలో 8 పంచమాత్ర గణములుండును. 1, 3, 5, 7 గణముల తొలి అక్షరములకు యతిమైత్రి కూర్పవలెను.

పై పద్యమున తొలిపాదమున 'క్ష్మలోని కకారమునకు—క,ఘ,గా లతో' యతి కూర్చబడినది.

(విజయ మంగళరగడకు ప్రతి పాదమున 16 సూర్యగణములుండును. యతిస్థానములు 1,5,9,13గా ఉండును.

పై పద్యమున పాదాదిని 'వై' వర్ణమున్నది. 2వయతి స్థానమున 'స్వ' మూడవ యతిస్థానమున 'ప్ర' నాలుగవ యతిస్థానమున 'వ'ఉన్నవి ఇవన్నియు పాదాది 'వ'కారమునకు మైత్రి కలవి.

(అనగా వై—స్వలోని 'వ'— 'ప్ర'లోని 'వ'—వలకుయతి)
రెండవ పాదమున దా—ద్వా—వ్యా—య లకు యతి కూర్చబడినది.
1,2 యతులు 'దా—ద్యాలోని దా'కు
2,3 యతులు 'ద్యాలోని వ-వ్యాలోవా'కు
3,4 యతులు 'వ్యాలోని య-య'లకు కూర్చబడినది.
ఇది తప్పు, అప్పకవి ప్రత్యుదాహరణముగా దీనిని చెప్పినాడు.

## 27· అంతోష్మసంధిపదులు

పాణినీయసూత్రము.
సూ॥ ఝయోహో౽న్యతరస్యామ్
వృ॥ ఝయఃపరస్యహస్య పూర్వసవర్ణో వాస్యాత్ వాక్ హరిః,
హోషవత్త్వాదిగుణవతో హస్యవర్గ చతుర్థః
పూర్వసవర్ణస్స్యాత్ వాగ్ఘరిః.

సీ. కైరవ కాముదు గ్ఘరవాహకవి కుంద
హైరణ్యగర్భవా గ్ఘంసబృంద
డిండీరభోగి రా డ్ఢిమశైలకైలాస
హారిధవళాంబు రు డ్ఢరినివాస

8 )

దేవాశ్వసురసరి ద్ధీర ముక్తా కాశ
హరిచందనై ణభృ ద్ధాత్రిదిగీశ
హారద ప్రాకశు బ్భస్తి కంబుక్షీర
హాలధర శారదా బ్భయపటీర

తే. పాండుసత్కీర్తి యని యిట్లు వర్గహల్లు
పొల్లులకుఁబై హకారంబు పొందునపుడు
కందిబంధన యంత్యోష్మ సంధి విరమ
ణాఖ్యచే దానికెయ్యది యైనఁజెల్లు. 115

పాణినీయమున 'ఝయ్యు' ప్రత్యాహార వర్ణములకు (ఝ, భ, ఘ, ఢ, ధ, జ, బ, గ, డ, ద, ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త, క, ప) హకారము పరమగునపుడు వీనికి పూర్వ సవర్ణాదేశము విభాషను విధింపబడుచున్నది. అపుడు రూప ద్వయము సిద్ధించుచున్నది.

వాక్+హరి=వాగ్ఘరి – వాగ్హరి

ఇట్టిచోట్ల హకారమునకు గాని, దాని కాదేశమయిన వర్ణమునకు గాని యతి కూర్చవచ్చును.

(ఝ య్యు లనగా అను నాసికములేని వర్గాక్షరములు)

పై పద్యమున తొలి పాదమున

కై — కామధుక్+హర (ఆదేశ 'ఘ'తో యతి)
హై— వాక్+హంస (లుప్త 'హ'తో యతి)

రెండవ పాదమున

డి — రాట్+హిమ (ఆదేశ 'ఢ' తో యతి)
హి— దట్+హరి (లుప్త 'హ'తో యతి)

దేవాశ్వసురసరిత్ క్షీర ముక్తా కాశ
హారిచందనైరావత హారాదిసీశ
పారద ప్రాకట బ్భస్మ శంబుక్షీర
హాలధర శారదాబ్భయపటీర

తే. పాండుసత్కీర్తి యని యిట్లు వర్గహల్లు
పొల్లులకు బై హకారంబు పొందునపుడు
కందిబంధన యంతో వ్యష్మ సంధి విరమ
ణాఖ్యచే దానికెయ్యది యైనఁజెల్లు. 115

పాణినీయమున 'ఝయ్యు' ప్రత్యాహార వర్ణములకు (ఝ, భ, ఘ, ఢ, ధ, జ, బ, గ, డ, ద, ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త, క, ప) హకారము పరమగునపుడు వీనికి పూర్వ సవర్ణాదేశము విభాషను విధింపబడుచున్నది. అపుడు రూప ద్వయము సిద్ధించుచున్నది.

వాక్+హరి=వాగ్ఘరి – వాగ్హరి

ఇట్టిచోట్ల హకారమునకు గాని, దాని కాదేశమయిన వర్ణమునకు గాని యతి కూర్చవచ్చును.

(ఝ య్యు లనగా అను నాసికములేని వర్గాక్షరములు)

పై పద్యమున తొలి పాదమున

కై — కామధుక్+హర (ఆదేశ 'ఘ'తో యతి)
హై— వాక్+హంస (లుప్త 'హ'తో యతి)

రెండవ పాదమున

డి — రాట్+హిమ (ఆదేశ 'ఢి' తో యతి)
హి— రట్+హరి (లుప్త 'హ'తో యతి)

నాగపర్యంక శాయి న న్మార్గయాయి
ధాతృనుతనామ యోగి హృ న్మధ్యధామ.

పై పద్యమున

న — గూఢపాత్+మద (ఆదేశ 'న'తో యతి)

ద — గోత్రభిత్+మణి (లుప్త 'త' తో యతి)

నా — సత్+మార్గ (ఆదేశ 'న' తో యతి)

ధా — హృత్+మధ్య (లుప్త 'త' తో యతి)

ఆది పురాణము నందు:

ఒకనాఁ డిందుధరుండు పార్వతియు లీ లోద్యాన కేళీసరి
న్నికటానేక వనప్రదేశముల దై తేయేంద్ర కన్యాప్సరో
నికురుంబంబులు పారిజాత కుసుమా నీకంబుపైఁ జల్లద
ర్పక బాణంబుల కెల్ల నెల్లయగు సౌ
భాగ్యంబు శోభిల్లఁగాన్. 118

పై పద్యమున రెండవ పాదమున (సరిత్+నికట) లుప్తత కార మునకు - తే తో యతి.

మనుచరిత్రమునందు (2-16)

మ. అకలంకౌషధ సత్త్వముం దెలియ మా
యాద్వారకావంతి కా
శి కురుక్షేత్ర గయా ప్రయాగముల
నే సేవింప కుద్దండగం
డక వేదండ వరాహ వాహరిపు ఖ
డ్గ వ్యాఘ్ర మిమ్మంచు కొం

డకు రాఁజెల్లునె బుద్ధిజాడ్యజనితో

న్మాదుల్గదా శ్రోత్రియుల్. 119

పై పద్యమున నాలుగవ పాదమున 'ంద—న్మా'లోని ఆదేశ నకారమునకు యతి.

తే. హాలధరానుజ మయటి నిత్యమ్మటంచుఁ
బలుకు వాక్యంబుచే మయ పదము గూడు
నప్పు డనునాసికంబె నిత్యమయి నిల్చు
నలినలోచను మేను చిన్మయ మనంగ 120

మయట్ ప్రత్యయము పరమగునపుడు ఈ ఆదేశము నిత్యము. చిత్+మయము-చిన్మయము అని యే రూపము. వికల్పరూపముండదు. కావున స్థానివర్ణముతో యతి కూర్పరాదు.

పై పద్యము నాలుగవ పాదమున 'న—చిత్+మయ' ఆదేశ నకారముతో యతి. స్థానికకారముతో యతి చెల్లదు.

ఇవి వ్యంజనాక్షర విరతి భేదంబులు

## *III.* ఉభయవళులు

ఇక నుభయవళు లెట్టి వనిన వివరించెద

సీ. సర్వేశ ! యుష్మద స్వచ్ఛబ్ద యతులును
బరరూప విరతులు, ప్రాది యతులు
వెండి నిత్య సమాన విశ్రాంతి, దేశ్య ని
త్యసమాస, నిత్యాభి ధానములును,

రాగమసంధి, వి భాగ, నామాఖండ,
పంచమీ విక్రృతి వి భక్తి యుగులు,
కాకుస్వర, ప్లుతా క్షరయుగ విశ్రామ
ములునన నుభయాఖ్య వెలయు వళుల

తే. క్రమత శబ్దానుశాసన ప్రభృతి పూర్వ
కవిజనంబుల కృతుల ల క్ష్యముల కలిమిఁ
బదియు రెండు విధంబులై పరఁగుచుండుఁ
దిద్విధంబులు దెలియంగఁ దగుముకుంద

సంధ్యక్షరములోని అచ్చునకుగాని, హల్లునకుగాని యతి
నేనివి ఉభయవళులు. (అఖండయతిని అప్పకవి అంగీకరించలేద
అంగీకరించిరి. అది తర్వాత చర్చించబడినది.)

అప్పకవి 12 ఉభయయతి భేదములను తెలిపెను.

1. యుష్మదస్మచ్ఛబ్దయతి, 2. పరరూపయతి, 3 ప్ర
4. నిత్యసమాన విశ్రాంతి, 5. దేశ్యనిత్యసమానవిశ్రాంతి, 6.
7. రాగమసంధివళి, 8. విభాగవళి 9. నామాఖండ మిశ్రమం, 10
విభక్తి విరామము, 11. కాకుస్వరవళి, 12. ప్లుతయుగ విశ్రామ

ఈ 12 ఉభయయతులకు నన్నయాది మహాకవుల గ్రంథ
లక్షణములు తెలిసికొనదగును.

## 29. యుష్మదస్మచ్ఛబ్దయతులు

క. క్షితి నస్మద్యుష్మత్పద
యతులనఁ గావ్యముల యుష్మ దస్మచ్ఛబ్ద

ద్వితయమునకుఁ బైఁ బ్రాణము
లతికిన నుభయంబుఁ జెల్లు నభయవిహారా 122

యుష్మద్, అస్మద్, శబ్దములకు అచ్చుపరమయి సంధి వచ్చు నపుడు సంధ్యక్షరములోని అచ్చునకుగాని, హల్లునకుగాని యతి కూర్చ వచ్చును.

సాంబోపాఖ్యానమునందు :

క. చతురానన నందవ ది
వ్యతపోధన వర్య యుష్మ దాగ మనమునన్
గృతకృతుఁడనైతిని నే
నతిపావన మయ్యె నస్మ దన్వయ మెల్లన్. 123

పై పద్యమున రెండవపాదమున 'వ్య'లోని యకారమునకు—(యుష్మదీ+ఆగమ) సంధి ఆకారమునకు యతి (స్వరప్రధాన వడి)

నాలుగవ పాదమున (నేను+అతి) (అస్మద్+అన్వయ) సంధి యక్షరము అకారములకు యతి (స్వర ప్రధానవడి)

అధర్వణాచార్యుల విరాటపర్వమునందు

ఆ. ధర్మ తనయ యుష్మ దాజ్ఞానిగళ విని
బద్ధ మగుచుఁ జిక్కు పడియెఁ గాక
విజయమత్త గజము విడివడ్డచో నడ్డ
పాటుగలదె విష్ట పత్రయమున. 124

పై పద్యమున తొలివిధమున 'ధ–(యుష్మద్+అజ్ఞ) సంధ్యక్షర మగు దకారముతో యతి.

ఆదిపర్వమునందు : (2-219)

క. ప్రస్తుత ఫణిసత్రభయ
త్రస్తాత్ములమైన యస్మదాదుల కెల్లన్
స్వస్తి యనిపలుక నవసర
మత్తీకున కయ్యె నిప్పు డంబుజనేత్రా 125

పై పద్యమున రెండవ పాదమున 'త్రలోనిత-(అస్మద్+ఆదులు) సంధ్యక్షరమగు దకారములో యతి, (యుష్మద్, అస్మద్ శబ్దములను పోలిన తద్, ఏతద్, భవత్ ఇత్యాదులకుకూడ ఉభయయతి చెప్పవచ్చును)

## 30. పరరూప విరతులు

వ్యాకరణ సూత్రము :

సూ. అచోఽన్త్యాదిటి

వృ. అన్త్యాచ్ ప్రభృతి శబ్దష్టిసంజ్ఞస్స్యాత్, శకంధ్వాదిషు (టేః) పర రూపంవ్యాచమ్ (వా)

శ్లో. శకంధు రథకర్కంధూః కుద్దాలోఽలక్తపర్కటీ,
లాంగలీషా హలీషాచ మనీషాచ పతంజలిః,
కుత్కోలోష్ఠిషమంజీర మస్తిష్కకులటాదయః,
తథావృకంధాసీమంతౌ శకంధ్వాదిగణేస్మృతాః.

శకానాం దేశానామంధుః కూపః శకంధుః, శకంధువనఁగాను శకదేశ మందలి బావిపేరు. కర్కస్యాంధూః కర్కంధూః 'కర్కంధూర్బదరీకోలీ' త్యమరః, కర్కంధువనఁగాను రేఁగుచెట్టు. కంశిరః ఉష్ణవీర్యత్వాదుద్దాలయతీతి కుద్దాలః, కుం భూమి ముద్దాలయతీతివా, దళవిశరణే, ఉదిత్యుపసర్గః, కుద్దాలో బహువారక ఇత్యమరః, కుద్దాల మనఁగాను విరిగిచెట్టు, పాదమలతీత్యలక్తః, అలభూషణే, 'యావోలక్తోద్రుమామయ' ఇత్యమరః, అలక్తమనఁగాను లత్తుక పేరు. పర్చ్యతే పరస్పరం స్పృజ్యత

ఇతి పర్కటీ, పృచి సంసర్గే: 'ప్లక్షోజటీ పర్కటీస్యా' దిత్యమరః, పర్కటి యనఁగాను జువ్విచెట్టు. లాంగలస్యేషాలాంగ లీషా, 'ఈషాలాంగల దండస్యా' దిత్యమరః. హలస్యేషాహలీషా. ఈ రెండును ఏడికోల పేళ్ళు. మనస ఈషా లాంగలదండవ త్సంబద్ధామనీషా, 'బుద్ధిర్మనీషాధిషణే' త్యమరః మనీష యనఁగా బుద్ధిపేరు పతత్ అంజలిః పతంజలిః. పతంజలి యనఁగాను వ్యాకరణమునకు మహాభాష్యము చేసిన నాగము పేరు. కోర్భ్యా మేరుత్కీలః కుత్కీలః, 'అగకుత్కీల జీమూతసానుమన్నగా పర్వతా' ఇత్యమరః, కుత్కీల మనఁగాను గట్టుపేరు. ఉష్ణస్య ఈషః 'ఉష్ణీష 'ఉష్ణీషశ్శిరోవేష్ట కిరీటమో' రితి నానార్థే, ఉష్ణీష మనఁగ దలపాగ పేరు. మంజుదచ్యమీరయతీతి మంజీరః, ఈరస్వనే: మంజీరోనూపురో స్త్రియా' మిత్య మరః, మంజీరమనఁగా గాలిగజ్జె మస్తంశిర ఇష్యతి ప్రాప్నోతీతి మస్తిష్కం' ఇషగతౌ, 'తిలకంకోమ మస్తిష్క' మిత్య మరః. మస్తిష్కమనఁగాఁ దల మెదడు పేరు. కులం విటకుల మటతీతి కులటా. అటగతౌ; 'అసతీకులటేత్వరీ' త్యమరః, కులట యనఁగా లంజె పేరు. ఆదిశబ్దముచేత వేదండసారంగములు మొదలయినవి మఱికొన్ని గలవు. వేదః సామవేదః అండః జనన కారణం యస్యసః వేదండః, సామోద్భవ ఇతి ప్రసిద్ధిః; 'సామజస్సింధురోపిస' ఇత్యమరః, వేదండ మనఁగా నేనుఁగు పేరు. సారాణ్యంగాని యస్యసః సారంగః, సారం గశ్చాతకే భృంగే కురంగే చ మతంగజ' ఇత్యమరః; సారంగ మనఁగాను చాతకాదుల పేరు. వృకస్య అంధుః వృకంధుః: వృకంధు వనఁగాను వృక దేశమందున్న బావిపేరు. సీమ్నః అంతః సీమంతః; సీమంతమనఁగాఁ బావట పేరు. ఇవి శకంధు శబ్దము మొదలుగాఁగలవి గనుకను శకంధ్వాది గణ మనబడును.

సంస్కృత భాషను 'శకంధ్వాదిషు పరరూపంవాచ్యం తచ్చ' అని పరరూపము నిత్యముగా విధింపబడినది. దీనివలన శకంధు, లాంగలీషా ఇత్యాది శబ్దములందు (శక+అంధు, లాంగల+ఈషా) సవర్ణ గుణ సంధ్యాదులు రాకపూర్వమునందలి 'టి' సంజ్ఞకు పరరూపము వచ్చుచున్నది. 'టి' సంజ్ఞ అనగా శబ్దము నందలి చివరి అచ్చు మొదలు ఉన్న వర్ణ సముదాయమునకంతకును సంజ్ఞ.

(పతతీలోని 'అతీ' మనస్‌లోని అస్ టి సంజ్ఞలు.

శక, కర్కలలో చివరి అకారమే టి సంజ్ఞ కలదగుచున్నది.)

క. విరతికి వ్యాకరణమునను
వరరుచిచేఁ జెప్పఁబడిన వాక్యమువలనన్
బరరూపము నిత్యంబై
పరఁగు శకంధ్వాదులకు నుభయముంజెల్లున్.

(పాణిని సూత్రకారుడు, వరరుచి వార్తికకారుడు పతంజలి కారుడు అందురు. 'శకంధ్వాది' సూత్రము వరరుచి వార్తికము.)

పై సూత్రము వలన శకంధ్వాదులకు పరరూప సంధి నిత్య వచ్చుచున్నది. తెలుగున ఈ గణమునకు ఉభయ యతి చెల్లును. శకంధ్వాదులలోని, సంధ్యక్షరమందలి అచ్చునకుగాని, హల్లునకుగాని చెల్లును.

(అచ్సంధి కారణముగ స్వరప్రధాన వడి, అఖండ శబ్దముగా టచే వ్యంజన యతి రెండును చెల్లును.)

వేదండ శబ్దమునకు ఆది పర్వమునందు : (3-228)

మత్తకోకిల. దండితాహిత వీర సూరిని ధాన దానవినో
దండపార్థ పరాక్రమప్రియ ధామ దిక్పరి పూరితా

ఖండపాండు యశోనిధీ పర గండభైరవ వైరివే
దండదండవిదారి ఘోరతరాసిభాసి భుజార్గళా. 127

పై పద్యము నాలుగవపాదమున (వేద+అండ, తర+అసి) సంధ్యక్షరములోని అకారమునకు యతి.

భీష్మ పర్వమునందు : (1-234)

ఉ. పాండునృపాల నందనులు పావనిముందుగఁ దాఁకినట్లు భీ
ష్మేందు గడంకమై నడుచు చోటికిఁ
జక్కటిగాఁగ ద్రోచియొం
డొండ గడంగి సేన తమ యుబ్బున కుబ్బంగ
నవ్యసైన్య వే
దండ ముఖాంగముల్ తృణ వితానముగాఁగొని
నిర్వికారులై. 128

పై పద్యమున నాలుగవపాదమున ద—కాలకు వ్యంజన మైత్రి.

సారంగ శబ్దమునకు చంద్రికా పరిణయమునందు :

ఉ. జంగమరోహణాద్రి నద్భ శంబులు తత్పురిఁగల్గు భద్రసా
రంగవరేణ్యముల్ పయికి హస్తము లించుకసాఁచి
యవ్వియ
ద్గాంగయురంబు పీల్చి మఱి తద్వమథు ప్రకరంబు దప్పి వా
యంగ నొసంగు రంగుగ ని జాఖ్య వహించిన
చాతకాళికిన్. 129

పై పద్యము రెండవ పాదమున (సాం+అంగ) సంధిస్వరమునకు
-ఘా తో స్వరయతి.

ద్రోణ పర్వమునందు : (1-17)

ఉ. అంగదనాథు ద్రుంగిన వృకావలి దన్వేసఁ జుట్టుకొన్న స
ర్వాంగము లుంజలింప బెగ డందుచు దిక్కులు
చూచుచున్న సా
రంగియుపోలె నుండెఁగురు రాజ భవత్సుతుసేన భీష్మనా
శింగబలించి పాండవులు జృంభిత విక్రమలీలఁ
బొల్చుటన్. 130

పై పద్యమున మూడవపాదమున ర-రాలకు వ్యంజనమైత్రి.

## 31. ప్రాదియతులు

ఉపసర్గలు :

శ్లో॥ ప్రపరాప్రతిపర్యత్యధ్యభ్యవానూప సంస్వప
నివినిర్దురుదప్యాజిత్యుపసర్గాస్తు వింశతిః॥

ప్ర, పరా, ప్రతి, పరి, అతి, అధి, అభి, అవ, అను, ఉప, సమ్, సు, అప, ని వి, నిర్, దుర్, ఉత్, అపి. ఆఙ్ ఇవి ఇరువదియును ఉపసర్గలు.

వ. ప్రకారోపసర్గంబాది యగుటంజేసి ప్రాదు లనంబడును.

ప్రపరా మొదలగు ఇరువదింటికిని ఉపసర్గలనిపేరు. ఈ ఉపసర్గలు చేరుటచే ధాతువు విశేషార్థము నిచ్చును. 'ప్ర'తో మొదలగుటచే వీనికి ప్రాదులనిపేరు.

తే. ఆంధ్రమునకుఁ జేరని పరా జపులు మూఁడు
గాక తక్కిన యుపసర్గ కముల తలల
న్వరము లతికిన వానిక వ్వలను నిలుచు
నచ్చయిన హల్లయినఁ బ్రాది యతి యనంగ. 132

'పరా, అవ్, అపి' అను మూడు ఉపసర్గములకును ఆంధ్రమున అనగా తత్సమములందు ప్రయోగములేని కారణమున ఆ మూడునుగాక మిగిలిన ఉపసర్గలకు అచ్చుపరమయి సంధి కలిగినప్పుడు అచ్చుతోగాని, హల్లుతోగాని ఉభయయతి చెల్లును.

తే. అబ్జయోని రజోగుణ ప్రాప్తిఁదనరుఁ
బద్మనాభుఁడు సాత్త్విక ప్రాప్తిఁదనరు
రజతగిరి మందిరుఁడు తమః ప్రాప్తిఁదనరు
ననఁగ నిబ్భంగిఁ బ్రాదుల కమరు యతులు 133

పై పద్యమున
తొలి పాదమున 'అ'కారమునకు-(ప్ర+ఆప్తి) సంధిగతమగు స్వరమునకు యతి.
రెండవ పాదమున 'ప'కారమునకు - ప్రాప్తిలోని పకారముతో వ్యంజనమైత్రి
మూడవ పాదమున 'ర'కారమునకు - ప్రాప్తిలోని రేఫముతో వ్యంజనమైత్రి.

వ. కడమ యుపసర్గములకు అన్నిటికిని ఇటువలెనే రెండుం జెల్లునని తెలుసికొనునది. 134

'ప్ర' ఉపసర్గకు అప్పకవి ఉదాహరణములు చూపి మిగిలిన వాటికి అట్లే ఉభయయతి చెల్లునని తెలుపుచున్నాడు.

## 32. నిత్యసమాస విశ్రాంతులు

తే. ఒక్క సమసనమున శబ్ద యుగము గూడి
పదము లేర్పాటుగాఁ గాన బడని ప్రాణ
సంధులకు నిత్యసమసన శ్రాంతులును న
ఖండ విశ్రమము లనన రెండుఁ జెల్లు. 135

(అనిగ్రహః, అస్వపద విగ్రహోవానిత్య సమాసః విగ్రహ వాక్యములేనట్టియు, సమాసగత పదములతో విగ్రహ వాక్యములేనట్టియు సమాసములు నిత్య సమాసములు.)

నిత్య సమాసములలో రెండు శబ్దములకు సంధి కలిగినను ఆ శబ్దములు వేఱువేఱుగ కనబడవు, ఒకే శబ్దమువలెనుండును. అట్టి సంధ్యక్షరమునకు ఉభయ యతి చెల్లును.

(నిత్యసమాస విశ్రాంతికే అఖండ యతి అనియు పేరు.

క. లోకంబునఁ గర్ణాట వ
నౌకోద్వీపాంతరీప నాస్తి పదార్థా
నేకాన్యోన్య జనార్దన
నాకాదులు నిత్యసమన సము లండ్రుబుధుల్. 136

వ. ఆదిశబ్దముచేత మందార నారికేళ శబ్దాదులు మఱియు ననేకములు గలవు.

కర్ణాట (కర్ణ+అట), వనౌక (వన+ఓక)
ద్వీప (ద్వి+అప్), అంతరీప (అంతర్+అప్)
నాస్తి (న+అస్తి), పదార్థ (పద+అర్థ)
అనేక (న+ఏక), అన్యోన్య (అన్య+అన్య)
జనార్దన (జన+అర్దన), నాక (న+అక)

ఆది శబ్దముచే ఈ నిత్యసమాసములలో చేరునవింకను కలవని తెలియుచున్నది. మందార (మంద+అర), నారికేళ (నారిక+ఈళ) వంటి శబ్దములనేకములు కనబడుచున్నవి.

కర్ణాట శబ్దమునకు రామాయణమునందు (4-826)

శా. లాటీచందనచర్చ చోళమహిళాలావణ్యసామగ్రి క
ర్ణాటీ గీత కళాసరస్వతి కళిం గాంతఃపురీ మల్లికా

వాటీ మంజరి గౌళవామ నయనా వక్షోజహారాళియై
పాటింపందగు నీదుకీర్తి రథినీ పాల్యాగ్రణీ సాహిణీ. 138

పై పద్యమున రెండవపాదమున 'కర్ణ+అటీ'- 'కళింగ+అంతః' స్వరయతి.

శ్రీనాథుని వీధి నాటకమునందు :

మ. కుసుమం బద్దిన చీరకొంగు వొలయం గ్రొవ్వారు పాలిండ్లపైఁ
బ్రిసరంబుల్ పొలుపార వేణి యుంటూ దేశంబుపై రాయఁగాఁ
బసనివ్వాఁడొ యొకండు రాత్రిరతులం బల్గాసి గావించిన
న్వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగ నంగంటిరే. 139

పై పద్యము నాలుగవపాదమున 'న్వ'లోని నకారమునకు-'కర్ణాటా లోని ణకారమునకు వ్యంజనయతి.

వ. వనౌకశబ్దమునకు వనే కానన నేఓకః స్థానమస్యేతివనౌకాః.

అధర్వణాచార్యుల విరాట పర్వమునందు :

క. శ్రీకంఠుఁ డెదురునపుడు వ
నౌకోధ్వజ మింద్రమకుట మర్జున తురగా
నీకము దివ్యశతాంగము
నాకవ్వడి కబ్బియున్న నతఁడేమగునో. 141

పై పద్యమున రెండవపాదమున 'నౌలోని ఔకారమునకు+అర్జున' పరసంధి గతస్వరమునకు వృద్ధి స్వరయతి.

దానియందు :

క. ఆకర్ణ దురాలాపము
లాకర్ణింపఁగ నసహ్య మై ద్రోణునితో
నాకనదీసుతుఁడనియె వ
నౌకోధ్వజ మఱుఁగవచ్చు నసుఁజూపితగన్. 142

పై పద్యమున నాలుగవపాదమున 'నౌ—న'లకు వ్యంజనమైత్రి.

ద్వీప శబ్దమునకుఁ గావ్యలంకార చూడామణి యందు : (7-65)

ఉ. ద్వీపులఁద్రుంచు విశ్వజగతీపతి యుత్తమశక్తి జాంబవ
ద్వీపమునందు గోవులకు నిమ్ముగఁ జేయుటయుం బ్రసన్నయై
గోపతిధేను వవ్విభున కుం జనవైభవ మిచ్చెఁగాక యే
భూపతు లీ వదాన్యగుణ బుద్ధిఁ బ్రసిద్ధి వహించి
రుర్వరన్. 143

పై పద్యమున తొలిపాదమున 'ద్వీలోని దీ-తీలకు' వ్యంజనయతి.

రెండవపాదమున 'ద్వి+ఈప' '+ఇమ్మగ'లలోని పరస్వరము లకు యతి.

నైషదమునందు : (1-44)

సీ.పా. వితత నవద్వయ ద్వీప నానాజయ
శ్రీవధూటీ సమాశ్లిష్ట భుజుఁడు. 144

పై పద్యపాదమున 'వి-ద్వీలో'వి' 'లకు వ్యంజనయతి.

వ. అంతరీవ ప్రతీప శబ్దములకును ఇటువలెనే. 145

'ద్వ్యం తరుప సర్గేభ్యోప ఈత్' అను సూత్రముచే అకారమునకు ఈకారము వచ్చి ద్వి+అప్—ద్వి+ఈప్—ద్వీప
అంతర్+అప్—అంతర్+ఈప్—అంతరీప
ప్రతి+అప్—ప్రతి+ఈప్—ప్రతీప అని
ద్వీప శబ్దమువలెనే సాధనీయములగుచున్నవి.

నాస్తి పదమునకు శృంగార షష్ఠమునందు :

సీ.గీ. తల్లియును దండ్రి దైవంబు తలఁప గురుఁడ
కాఁడె యితఁడేమి చేసినఁ గనలఁదగునె
నాస్తికాధమ యోరి యన్యాయవృత్తి
'నాస్తితత్వం గురోఃపర' మ్మనఁగ వినవె. 146

పైపద్యమున మూడవ పాదమున 'నా-న్యాలోని నా' లకు వ్యంజన యతి.

నాలుగవ పాదమున 'న+అస్తి-పరమ్మ+అనగ' సంధిగత స్వర యతి.

ఏష్ణు చిత్తీయమునందు : (1-84)

శా. ఆనిష్ఠానిధిగేహసీమ నడు రే
యాలించినన్ మ్రోయు నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలుం
దివ్యప్రబంధాను సం
ధానధ్యానము 'నాస్తిశాకబహుతా,
నాస్త్యుష్ణతా, నాస్త్యపూ

షో, నాస్త్యోదన సౌష్ఠవంచ, కృపయా
భోక్తవ్య మన్నల్కులున్. 147

పై పద్యము మూడవ పాదమున 'ంధా—నా' లకు బిందు యతి.

పదార్థ శబ్దమునకు సాంబ విలాసమునందు :

తే. హాలికినెదు రేఁగి సకల పదార్థములు ను
పాయము వెట్టి నీముద్దు పట్టితోడ
జాంబవంతుని దౌహిత్రు శౌరిపుత్రు
సాంబు నొప్పించి బ్రతికించు సకలజనుల. 148

పై పద్యము తొలి పాదమున 'హ-(పద+అర్థ) సంధిగత అకార మును' యతి.

భాస్కర శతకమునందు :

దక్షత లేనియింటికిఁ బదార్థము వేఱొక చోటనుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బలాయనమై చనుఁగల్లగాదు ప్ర
త్యక్షము వాగులు న్వఱద లన్నియు వచ్చిన నీరు నిల్చునే
యక్షయమైన గండి దెగి నట్టి తటాకములోన భాస్కరా.
149

పై పద్యము తొలి పాదమున 'ద-దా' లకు వ్యంజన యతి.

అనేక శబ్దమునకు విష్ణు చిత్తీయమునందు : (1-35)

క. తునియలు తో మ్మిదయుఁట పదు
నెనమండ్రఁట మోచువార నేకపకిటి కూ
ర్మనగావాలు లేటిలావరు
లని తావక బాహు వొకటి యువని భరించెన్. 150

పై పద్యము రెండవ పాదమున '+ ఎనమంత్రు-న+ఏక' సంధి
త స్వర యతి.

హ స్తి మాహాత్మ్యమునందు ; (1-42)

॥ తాను గుమారజంగమ సుధారక మాళియుఁగూడిమాడి
యిం

పైన రతిప్రసంగముల నర్ధనిమీలిత నేత్రపద్మముల్
మానని చుంబనంబలర మాటలు సొక్కులు వీడి వీడిపో
నీని కవుంగలింతలు న నేక విలాసములుం
జెలంగఁగాన్. 151

పై పద్యము నాలుగవ పాదమున 'వీడిపోన్+ఈని-న+ఏక'
ంధిగత స్వరయతి.

కర్ణ పర్వమునందు (2-355)

. మ్రొగ్గెడు వాహనంబులును మోములు ద్రెళ్ళఁగ జారు
వాజులు
న్డిగ్గి తొలంగు సైనిరుల నేకులు గష్టపుఁబాటు చొప్పడన్
మ్రగ్గు సిడంబులుం గులముమాటికి
నేటియెదిర్చియొంటిపై
మ్రగ్గెడు వారు సై కురుధ రావరు సైన్యము
రూపుమాయఁగాఁ 152

పై పద్యము రెండవపాదమున 'న్డిలోని డి—నే'లకు వ్యంజనయతి

ఆముక్తమాల్యదయందు (1–52)

మలిచి పయోజకోశముల మాడ్కిఁ
నొనర్చిన పద్మరాగపుం
గలశపుబెట్టి డాల్ప్రమిడి కంబులతో
నవరంజి యోడు బి
ళ్ళల నలవై జంతముఁ జలంబున
గెల్వఁదదంశితంబులై
నిలిచినభంగి మాడువుల నేకములుల్ల సిలుం
బురంబునన్ **153**

పై పద్యమున 'ని-నే'లకు వ్యంజన యతి.

వ. అనాది అనంత అనంగ అనూరుశబ్దములు మొదలయిన నఞ్ సమాసముల కన్నిటికిని ఇటువలెనే రెండునుం జెప్పవచ్చును. **154**

న+ఆది, న+అంత, న+అంగ, న+ఊరు

ఇచట నఞ్ సమాసవిధి వర్తించుచున్నది.

'నఞ్' యొక్క నకారము అచ్చుపరమగునపుడు 'అన్'గాను, హల్లు పరమగునపుడు 'అ' గాను మారుతుంది.

అన్+ఆది=అనాది, అన్+అంత=అనంత

అన్+అనంగ=అనంగ, అన్+ఊరు=అనూరు

అసత్యము, అధర్మము హల్లు పరమైనపుడు సిద్ధించినరూపములు. అచ్చు పరమగునపుడే యుభయ యతి వచ్చును.

అనాది, అనంత ఇత్యాది నఞ్ సమాస శబ్దములందు పరపదాది స్వరమునకుగాని, సంధిలో నిలిచిన హల్లు(నకారము)నకు గాని యతి చెల్లును.

న్య శబ్దమునకుఁ గావ్యాలంకార చూడామణియందు (7-68)

ధన్యుఁడు విశ్వభూవిభుఁడు ధారుణి నేలఁగ భూజనంబు ల
న్యోన్యహితత్వ సంపదల నొందిరి దంపపు లింపునింప న
న్యోన్య సుఖానుకూలతల నోమిరి

విప్రులు వేల్పుపిండు న
న్యోన్య సుపుష్టి తుష్టికుశలాదుల నొందిరి నాఁడు

నాటికిన్ 155

లంకార చూడామణి క ర్త విన్నకోట పెద్దన,

అన్య+అన్య=అన్యోన్య—ఇట లు ప్తవిసర్గక స్వరవశిచే అకార
కు, సంయు క్త యతిచే 'న్య'లకు ఉభయ యతి చెల్లును.

పై పద్యమున రెండవ పాదమున న్యోలోని 'యో' కారమునకు-
తలన్+ఒందిరి సంధిగత స్వరమునకు యతి.

మూడవ పాదమున న్యోలోని 'నో'కు—నోమిరి నోకు యతి.

నాలుగవ పాదమున అన్య+అన్య—కుశల+ఆదుల పరపదాది
యతి ఇది లు ప్తవిసర్గక స్వరవశిచే సాధ్యము

జనార్దన శబ్దమునకు—

జనార్దనయతి సుఖయతీతి జనార్దనః అర్థగతౌ యాచనేచ 'విశ్వక్సేనో
జనార్దన' ఇత్యమరః

సాంబవిలాసమునందు—

శరధి సుతాకళత్ర నవ సారసనేత్ర బలాంతకాది ని
ర్జర నుతనామ పాతకవి రామ విహంగమ యాన చారుక
ర్బుర పరిధాన పాండవ వి రోధి విభంజన నిర్మలాత్మకా
యరుచి జితాబ్దఖంజన జనార్ధన కైటభదైత్యమర్దనా

156

పై పద్యము నాలుగవ పాదమున 'య-జన+అర్దన సంధిగత స్వరమునకు' యతి.

అరణ్యపర్వమునందు (4-397)

చ. నగినగి యేనియు న్వీను జనార్దన యెన్నండు బొంకువల్క మ
త్యగణిత విక్రమోరు బల ధైర్య సమగ్రుల మట్లుగాక కా
లగతి దొలంగం ద్రోవంగ ద లంబగునే యగుంగాక నీకు మెం
చ్చగనిదె ప్రాణమిచ్చెదము ప్రస్కమ్ము చావునీ కాత్మ నేమియున్ 157

పై పద్యమున తొలిపాదమున 'న-నా' లకు వ్యంజనయతి

వ. నాకశబ్దమునకు, నవిద్యతే అకం దుఃఖంఅత్రేతి నాకః స్వరవ్యయం స్వర్గనాక త్రిదివత్రిదశాలయా ఇత్యమరః

గౌరరాజు చాటుధార—

ఉ. ప్రాకటదర్పులై సకల రాయుని లక్కనృపాలు నాజిలో
దాంకు విరోధిసైన్యము ముదంబొదవన్వరియింప వచ్చుచో
నాకసమెల్ల గ్రమ్ముకొను నంచిత దివ్యవిమాన సంచ
నాక విలాసినీ చరణ హంసక భూరి ఝణం ఝణధ్వనుల్ 15

పై పద్యమున నాలుగవ పాదమున (న+అక) సంధిగత అకారమునకు-హ 'తో' యతి.

విరాటపర్వమునందు (5-124)

మును వెఱతునేయ మీరలు
ను నేసినఁగాని యనుడు నాకేశసుతుఁ
నురాచార్యుఁడు దెబ్బది
నిశిత బాణముల నేసెఁ జూపఱు వొగడఁ 159

పై పద్యమున రెండవ పాదమున 'న-నా'లకు వ్యంజన యతి.

లంకార చూడామణి యందు : (7-66)

కరవాలము వాలై
రాకంబున కేఁగి రాజ నారాయణ యా
కాంతు లెట్టిచనవో
రాక విటోత్తములఁ దూల నడతురు కడిమిన్. 160

పై పద్యమున రెండవ పాదమున 'నా-నా' లకు వ్యంజన యతి.
నాలుగవ పాదమున (న+అడ)-(తూలన్+అడతురు) సంధి గత యతి.

మిత్ర శబ్దమునకు రంగనాధుని రామాయణమునందు :

పద. ఎక్కడా గురుఁడని యెఱుఁగని నీకు
నక్కటా గురుఁడ వి శ్వామిత్రుఁడయ్యె. 161

పై పద్యమున రెండవ పాదమున (నీకున్+అక్కటా) - (విశ్వా
ప) సంధిగత స్వర యతి.

కర రామాయణమునందు : (5-263)

హరకోదండ విఖండనుండు జనక క్ష్మాధీశు జామాత భా
నుకర వంశాగ్రణి జానకీప్రియుఁడు వి శ్వామిత్ర
యాగాహితా

సురసంహారి విరాధకాలుఁడు ఖరా సుద్వంసి
మారీచ సం
హారుఁ డన్య ప్రమదా పరాఙ్ముఖుఁడయోధ్యానాయ
కుండాదటన్. 16

పై పద్యమున రెండవ పాదమున 'స్కాలోవి స-శ్వాలోని శ' లకు
వ్యంజన యతి.

అపోశన శబ్దమునకుఁ జమత్కార రామాయణము నందు :

క. ఓ శశిముఖి లోపాము
ద్రేశుఁడు కలశభవుఁడుండు నిట నతఁడు తపో
గాశి మహాత్ముఁడు మునుపా
పోశనగముగఁగొనియె సాగ రాంబువు లెల్లన్. 1

పై పద్యమున నాలుగవ పాదమున (ఆప+అశన) - (సాగర
అంబువు) పరపదాది స్వర యతి.

లుప్త విసర్గక స్వరములచే సాధ్యము.

శృంగార షష్ఠమునందు :

సీ.గీ. తత్తరంబున నాపోశన మెత్తఁబోయి
భూసురుండెత్తె నుత్తరా పోశనంబు. 1

పై పద్యమున రెండవ పాదమున 'భూ-పో' లకు వ్యంజన య

స్వాంత శబ్దమునకు శృంగార నైషధమునందు : (2-82)

గీ. అధికరోష కషాయిత స్వాంతుఁడైన
నరపతికి విన్నవింపకు నా యవస్థ
పైత్యదోషోదయంబునఁ బరుసనైన
జిహ్వకును బంచదారయుఁ జేఁదుగాదె. 1

పై పద్యమున 'అకారమునకు-(స్వ+అంత) సంధిగత అకారమునకు స్వరయతి.

విరాటపర్వమునందు : (2-331)

ఉ. స్వాంతము, బాహుగర్వఘన సంతమసాంధముగాఁగ శంకయా
వంతయు లేక కీచకుఁడ హంకృతి ముంగలి నాగమంటపా
భ్యంతరసీమఁ జొచ్చి దరి యంజని యారసి నెజ్జఁగాంచి య
త్యంతము దావహంబగుడు నందు రయంబునఁ గేటు

సాఁపఁగాన్. 166

పై పద్యమున మొదటి పాదమున 'స్వాం'లోని సకు-స కు యతి.

ఏకాంత శబ్దమునకు పారిజాతాపహరణమునందు : (1-43)

అంతట నొక్కనాఁడు ధవ ళాంబుజనేత్రుఁడు వచ్చిరుక్మిణీ
కాంత గృహంబులోన శశి కాంతశిలామయ వేదిమీఁద నే
కాంతమునందుఁ గొందఱు మృగాయతనేత్రలుగొల్వ జూదమ
త్యంతవినోదకేళి మెయి నాడుచునుండఁగ నద్భుతంబు

గాన్. 167

పై పద్యము మూడవ పాదమున (ఏక+అంత)—(మృగ+ఆయత) సంధిగత స్వరయతి.

ఆదిపర్వమునందు : (8—24)

సీ.గీ. కామసుఖ సంగములకు నే కాంతగృహము
పొలిచిపొలిచియు ధర్మార్థ ములకు నిదియు

యాస్పదంబన వర్గత్ర యానురమ్యు
లైన జనులకెంతయు నొవ్వు నప్పురంబు 168

పై పద్యమున తొలి పాదమున కా-'ఏకాంత'లోని కా కు వ్యంజన యతి.

వ. సిద్ధాంత, రాద్ధాంత, లతాంత, ప్రాంత, నిశాంతాది
శబ్దములకన్నిటికిని ఇటువలెనే రెండును నడచును. 169

సిద్ధ+అంత, రాద్ధ+అంత, లతా+అంత, ప్ర+అంత, నిశా + అంత వీనికి ఉభయ యతి చెల్లును.

నారాయణ శబ్దమునకు,

నారాః ఆపః అయనం స్థానమస్య నారాయణః 'విష్ణుర్నారాయణః కృష్ణ' ఇత్యమరః.

ఆదిపర్వమునందు : (1-25)

పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా
రాయణ నట్లు దానును ధరామర వంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడీకృతి కిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడునైన వాఁడభిమతంబుగఁదోడయి
నిర్వహింపగాన్. 170

పై పద్యమున రెండవ పాదమున (నార+అయన)–(ధరా+అమర) సంధిగత స్వరయతి.

మూడవ పాదమున రా–ర లకు వ్యంజనయతి.

వాతాయన శబ్దమునకు
చారుధేష్ణ చరిత్రమునందు :

గీ. అచ్చరలు వందనంబున( దెచ్చుకొను సు
రాగసుమములు హర్మ్యవాతాయనముల
చెంత( గాలూ(ది తత్పుర స్త్రీలకొసంగి
వే(డికొని పోవుదురు శ్రవ పీడియములు 171

పై పద్యము రెండవ పాదమున (సుర+అగ) — (వాత+అయనము) సంధిగత స్వరయతి.

విరాటపర్వమునందు (2-238)

సీ. పా. తరుణులు( బతులు వాతాయనమ్ములనల్ల
మలయ వే(బోకల మలయపవను 172

పై పద్యమున త-తాలకు వ్యంజనయతి.

ఉపాయన శబ్దమునకు ;
సుదక్షిణాపరిణయమునందు ;

సీ. వల(బడియున్న జకొ(-వక వంబురుణింపుచు నన్నపై(టలో
పల బిగియుబ్బదోయ కను పండువుసేయ(గ మోడ్పు( జేతు లా
దలను ఘటించి మ్రొక్క(-డి పదంపడి మెల్లన డాయ( బోయితో
య్యలి విరిబంతిదోయిట నుపాయన మాయనకిచ్చి యిట్లనున్ 173

పై పద్యమున నాలుగవ పాదమున తొయ్యలిలోని 'య'కు-(ఉప+అయన)లోని అ కు స్వరయతి.

అష్టమహిషీ కళ్యాణమునందు

ద్వి. ఇంతుల మేల్బంతి యిడినసేవంతి
బంతి చేదోయి ను పాయనమిచ్చి 1

పై పద్యమున రెండవ పాదమున బ-పాలకు వ్యంజనయతి.

రసాయన శబ్దమునకు :

అనంతుని ఛందమునందు (1-21)

అ. నాస్తి యనక మహిన నంతసంపదలు నా
రావణుం డొనంగు రమ్యమగు ర
సాయనంబు బుధుల కేఁడన నిత్యస
మాసయుతులు రెంటె నంటియుండు 17

పై పద్యమున మూడవ పాదమున (రస+అయనంబు)-(బుధులకు+ఆతఁడు) సంధిగత స్వరయతి.

జైమిని భారతమునందు (1–22)

సీ. గీ. మత్తిమాత్రంబె పిల్లల మత్తి పేరు
పేరువలెఁగాదు శారదా పీఠకంబు
వారిలోపలఁబిన వీరు వాక్యసరణి
స రసులకునెల్ల గర్త ర సాయనంబు 17

పై పద్యము నాలుగవ పాదమున స–సాలకు వ్యంజనయతి.

రామాయణ శబ్దమునకు :

రాఘవ పాండవీయమునందు (1-4)

ఉ. ఏయెడ నర్థగౌరవ సమృద్ధియు శబ్దవిశుద్ధియుం దిరం
బై యనవద్యతం బరఁగ నంధ్రవచస్స్థితి భారతంబు రా
మాయణమున్ రచించిన మహాత్ముల నాత్మఁదలం చెదన్ జగ
ద్గేయుల నన్నపార్యునిని దిక్కనను నెఱ్ఱన భాస్కరా ఖ్యునిన్ 177

పై పద్యము మూడవపాదమున (రామ+అయన)-(మహా+ఆత్ముల) సంధిగత స్వరయతి-

జైమిని భారతమునందు (6-96)

తే. మాని జల్పితమైన రామాయణంబు
స్వరలయగ్రామ మూర్ఛనా నరణులెఱిఁగి
గానశక్తుల మెఱసి సాశ్లాఘ్యకరింపఁ
బాడి రాలాపములఁ బ్రదిన ప్తములు మెట్ట 178

పై పద్యము తొలి పాదమున మా—మాలకు వ్యంజనయతి,

వ. పరాయణ, పలాయన, బాదరాయణ, సాంఖ్యాయన, శాకటాయన, కాత్యాయన, వాత్స్యాయన, భోదా యన, దక్షిణోత్తరాయణాది శబ్దములకును ఇట్టివలెనే రెండును గలవు, 179

'అయనము' ఉత్తరపదముగాగల పైవానికన్నిటికిని ఉభయం చెల్లును.

మార్తాండ శబ్దమునకు
శృంగార షష్ఠమునందు

సీ. గీ. వలవదు భయంబు వారెంత వారలైన
నట్టివారలు మన కగ్గమైనవారు
వారు నిరయంబునకుఁ గాఁపు వచ్చువార
లనుచు బుద్ధిగ జెప్పె మార్తాండసుతుఁడు 18

పైపద్యము నాలుగవ పాదమున (వారలు+అనుచు)-(మార్తా+అండ) సంధిగత స్వరయతి.

ద్రోణ పర్వమునందు :

మ. ధరణీచక్రము దిర్దిరందిరిగె మార్తాండుండు కుంతీభవ
త్కిరణుండయ్యె దిశావితానము వడం కెన్నిన్నదశ్చిన్నపీ
ధర సంతానములోన గ్రక్కదలెను బ్రాంతంబులై యంబుధుల్
పొరలెన్ గట్టులమీఁద జెట్టు పిడుగుల్ వ్రాసెన్ని తాంత ధ్వనిన్. 18

పై పద్యము తొలిపాదమున ధ-ర్తాలోని 'త' కారమునకు వ్యంజన యతి.

వ. బ్రహ్మాండాది శబ్దములకును ఇటువలెనే అచ్చును హల్లును జెప్పఁదగును. 182

అంత శబ్దము ఉత్తరపదముగాగల బ్రహ్మాండాది శబ్దములకును ఉభయయతి చెల్లును.

ఉపసర్గ సంధికి

చంద్రికా పరిణయమునందు :

ఉ. అంతట రుక్మబాహు వసుధాధిప నందన
దొక్కనాఁడు శు
ద్ధాంతగృహంబు వెల్వడి విహారరతిం జనుదెంచి
నెచ్చెలుల్
చెంతలఁగొల్వ గుంజదళి శింజిత రంజిత కుంజమంజుల
ప్రాంతగళత్ఫలానవర తాంగజఘోటికిఁ బుష్పవాటికిన్

పై పద్యము తొలిపాదమున 'అ'కారమునకు— (వసుధా+అధిప) అకారమునకు స్వరయతి.

కవిజనాశ్రయమునందు : (1-66)

క. మానుగ విశ్రామాక్షర సమంచితమై స్వరముఁదినన్ దదీ
యానుగుణాక్షరంబు కొని యైనను జెప్పఁగనొప్పు నీ
క్రియన్
భాను సహస్రభాసి నృప భాధిపుఁడన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండవడి పొల్పగు నాది కవిప్రణీతమై 184

పై పద్యము మూడవపాదమున భా-భాలకు వ్యంజనయతి.

వ. ద్వార శబ్దమునకు, ద్వే అరే పార్శ్వా యస్యతత్ ద్వారమ్ పృషోదరాదీని యథోపదిష్టమితి సూత్రేణ ద్విశబ్దాంతస్య. అకారాదేశః

ద్వి+అర-ద్వ+అర-ద్వార అగుచున్నది. ఇట ఉభయయతి చెల్లును.

ఉ. వారక వారకామినుల వర్తులచారు కుచోపగూహముల్
కోరక కోరకోల్లసిత కుంజములం జిగురాకు పానుపుల్
చేరక చేర కేరళ కళింగ కుళింగ నరేంద్ర మందిర
ద్వారవిహారులై సిరుల నందక నందక పాణిఁ గొల్వరో.

పై పద్యము నాలుగవపాదమున (ద్వ+అర)—(సిరులన్+అందక) సంధిగత స్వరయతి.

హల్లునకు నిర్వచనోత్తర రామాయణమునందు (1-84)

ఉ. వారలు వారి భూరి పరి వారముతోన విమానమెక్కి రా
గా రఘునందనుం డరిగి కాంచన తోరణచిత్రమై నవ
ద్వార నికాయమైన నిజ పట్టణముత్సుక వృత్తిఁ జొచ్చె నిం
డారు ముదంబునన్ భరతు నాకృతి బాలిశవృత్తిఁ
గ్రాలఁగాన్. 186

పై పద్యము మూడవ పాదమున 'ద్వా'లోని వాకు ను-వ కారమున కును వ్యంజనయతి.

## కృత్ ప్రత్యాంతములు

వ. కుమారవదాచరితా శక్తిః, కుమారాయితశక్తి, కుమారాయితయా శక్త్యాశాలత ఇతి కుమారాయిత శక్తిశాలీ, కుమారసమాన పరాక్రమ ద్యోతవా నిత్యర్థకః.

ఆదిపర్వమునందు (5-6)

ఉ. ఆయము గర్వమున్విడిచి యన్యపతుల్పనిసేయు నిట్లు గాం
గేయభుజాశ్రయంబున నికృత్త విరోధి సమాజుఁడై కుమా
రాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న
త్యాయతకీర్తితోఁదనకు హస్తిపురంబది రాజధానిగాఁన్

పై పద్యము మూడవ పాదమున రా-రాలకు వ్యంజనయతి.

వ. భద్రవదాచరితామూర్తి ర్వ్యస్యతత్ భద్రాయితమూర్తి శోభన మూర్తిమదితియావత్, అయమపి క్యజ్ ప్రత్యయాంతః.

విరాటపర్వమునందు (1-1)

ఉ. శ్రీయన గౌరినాఁబరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి 'విష్ణురూ
పాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత నిమ్మఁబొల్చుపర తత్త్వముఁగొల్చెద నిష్టసిద్ధికిన్. 188

పై పద్యము రెండవ పాదమున 'ద్రా'లోని రాకును-రకారమునకును వ్యంజనయతి.

౧. ఈ రెండు పద్యములయందును నన్నయ తిక్కనగార్లు కుమార భద్రశబ్దములు క్యజ్ ప్రత్యయాంతములుచేసి

12)

సంయుక్త విశ్రామంబులుగాను బ్రయోగించిరి. అది గనుకఁ గొందఱా రెండు శబ్దములమీఁదను అకారము లున్నవి, నిత్యసమాన విశ్రాంతులని భ్రమయుదురు. శ సూత్రమువలన వానికే దీర్ఘములు వచ్చినవిగాని అంద లోపల అత్తులు లేవు. 18

నన్నయ తిక్కనలు కుమారాయిక, భద్రాయిత శబ్దములను వ్యంజ యతిగనే ప్రయోగించిరి. కొందరు ఆ శబ్దములమీద అకారమున్నద సవర్ణదీర్ఘ సంధి అని భ్రమించి ఉభయయతి చెల్లుననుకొందురు. ఇచట అ రము లేదని, శబ్దసూత్రముచే పూర్వాచ్చునకే దీర్ఘము వచ్చినదని తెలుసు కొనవలెను. కావున ఇట నిత్య సమాస యతి సిద్ధించదు.

## ౨౨. దేశ్య నిత్యసమాస విశ్రాంతులు

తే. శబ్దశాసనముఖ కవీశ్వరకృత ప్ర
బంధముల లక్ష్యములఁ గను పట్టు కతన
దేశ్య నిత్య సమాస సంధికిఁ బొసంగు
వడి స్వరంబైన వ్యంజన వర్ణమైన. 1

నన్నయాది కవీశ్వరుల కృతులందు అచ్సంధి కలిసినవియై పదమువలె కనబడునట్టి దేశ్యశబ్దములయందు ఉభయయతికి లక్ష్యము గనబడుచున్నవి. కావున వానివి ఉభయయతి చెల్లి దేశ్య నిత్యసమా యతులనబడును.

క. రూపఱఁ. బెంపఱఁ బెల్లఱ,
నేపఱచుట, గ్రిక్కిఱియుట, విల్గ్రచ్చఱయుం,
జూపఱ, యుక్కిఱి మొదలుగ
నొప్పారెడి యివి దేశ్య నిత్య సమసన పదముల్. 19

వ. కొందరు వీనిపేరే దేశ్యాఖండములును అందురు. 192

రూపు+అఱన్ = రూపఱన్—రూపునశించ అని అర్థము. అఱు ధాతువునకు నశించు అని అర్థము. రూపఱు, పెంపఱు, పెల్లఱు, ఏపఱచుట, క్రిక్కు+ఇఱియుట-క్రిక్కిఱియుట, క్రచ్చఱు, చూపఱి, ఉక్కఱి మొదలగునవి దేశ్యనిత్య సమాసపదములు.

సంస్కృత నిత్యసమాసయతి ఇంతకుముందు చెప్పబడినది. ఇది దేశ్య పదములకు చెందినదగుటచే దీనికి దేశ్యనిత్యసమాస యతియని పేరిడబడినది. నిత్య సమాసయతికి అఖండయతి అనికూడ పేరున్నది. కావున ఈయతికి దేశ్య ఖండయతి అనికూడ పేరు.

అనంతుని ఛందమునందు : (1-101)

తే. అఱనసంగను బోవుట కర్థమైన
సంధి నిత్యసమాసోక్తి జరుగు రెంట
నసుర వీరులనెల్ల నుక్కఱ వధించె
భానుకులుఁడు రావణుని నేపఱచెననఁగ 193

పై పద్యము అనంతుని లక్షణ లక్ష్యములు గల పద్యము.
మూడవపాదమున (రెంటన్+అసుర)-(ఉక్కు+అఱ)-స్వరయతి
నాలుగవపాదమున భా—ప వ్యంజనయతి.

అరణ్యపర్వమునందు : (6-345)

క. ఎఱకలుగల కులశైలము
తేఱఁగున మైరయుము మెఱయ దివికి నెగసి బి
ట్టుఱుము జలధరము క్రియ ను
క్కఱఁ దద్వానమెల్ల నద్రువ నార్చుచుఁగడిమిన్. 194

పై పద్యము నాలుగవపాదమున (ఉక్కు+అఱ)—(అద్రువన్+అర్చుచు)-స్వరయతి.

యుద్ధకాండమునందు : (784)

చ. ఎఱిఁగి యెఱింగి యున్నతఁడె యగ్గొనరించిన దానికై క
 తెఱఁగొని వచ్చితం బిదప సీత వృథాకథలింక నేల
 పఱ బ్రతుకింతతీయనె ఖ రాదులచావున కేమిచింత నీ
 మఱఁదలి బన్న మేపగిది మానిని యీఁగుదు సంధిఁ
 జేసినన్. 1

పై పద్యము మూడవపాదమున (పెంపు+అఱ)-(ఖర+ఆదు
స్వర ప్రధానయతి.

వశిష్ఠరామాయణమునందు :

ఉత్సాహ. మఱి యుఁ బెక్కు యోనులందు మహిత
 చిత్రగతులఁ
 పఱ జనించి దుఃఖభాజ నై చలించి పొందియున్
 పఱలు విప్రవరునియింట వాసుదేవుఁ డనఁగదా
 నెఱుకగలిగి పుట్టి వేల్పుటేటి తీరభూములన్. 1

పై పద్యము రెండవపాదమున (పెంపు+అఱ)-(భాజ+ఐ) స
యతి,

విరాట పర్వమునందు : (5-1-143)

చ. చిఱునగవొప్ప గాండివము చెచ్చెర సజ్యముఁ జేసి సేన
క్కఱ రథసంబుమై నడరఁ గవ్వడి ద్రోణియు నీడుపోక
త్తఱి దఱుమంగ వస్త్రములు దండడి దాఁకొని మందు
 చుం డెఁ
చ్చఱి పిడుగు ల్వడిం దొరఁగు చాడ్పున నంబరవీధి
 నుగ్రమై. 19

పై పద్యము రెండవ పాదమున క-క వ్యంజనయతి.

లక్షణ సారసంగ్రహమునందు :

తే. అచ్చు హల్లును దేశీయ మనియెడి వడి
యెన్న నొక్కొక్కచోటఁ గ్రిక్కిఱిసెఁగృతుల
సరస లక్షణకవులు గ్రచ్చుఱ నొనర్ప
భంజితాసుర సముదాయ యాంజనేయ. 198

చిత్రకవి పెద్దన దీనిని దేశీయ విరమణమని పేర్కొని లక్షణ లక్ష్యముల నిచ్చియున్నాడు.

పై పద్యమున

రెండవపాదమున (ఎన్న)-(క్రిక్కి+ఇఱియు)స్వరయతి.

మూడవపాదమున స-చ వ్యంజనయతి.

నిర్వచనోత్తర రామాయణమునందు : (5-14)

చ. ఎఱుఁగవుగాక భోగముల కెల్లను నెచ్చెలి జవ్వనంబు ని
త్తఱి నుడివోవకుండ నుచితంబుగ జక్కవదోయిఁబోలి క్రి
క్కిఱిసిన చిన్నిచన్నుఁగవ యింపెసలారఁగ నాదుచిత్తమ
న్వఱలు సరోవరంబున నారణకేళి యొనర్పు కోమలీ.199

పై పద్యము మూడవపాదమున (క్రిక్కి+ఇఱిసిన)—ఇం స్వర యతి.

అరణ్య పర్వమునందు : (7-367)

చ. ఎఱిగితి నిన్ను నేను విబుధేంద్రుఁడ వీవు జగత్త్రి
యంబుఁ గ్ర
చ్చుఱ భవదీయ రక్షణము నందు వెలుగుచునుండు నట్టి ని

న్నెఱుఁగ నేను వేఁడుకొన నత్తుండఁగాక మొఱంగి
వన్న
కర్ణ—అవడి నీవు వేఁడుటిది కర్జమె నిర్జితదైత్య చెప్పుమా

పై పద్యము రెండవపాదమున (త్రచ్చు+అఱ)—(మున్+అం
స్వరయతి.

ఉద్యోగ పర్వమునందు : (1-176)

చ. తఱియగు నంతకున్ రిపు నుతగ్రతి సైచుట నీతి నీవున
కఱపినయట్లు సేయుము త గంజని యూతనిఁగాంచినన్న
త్రెఱఁగునన్నైనఁ బొందఁగ మదింగల దేనియు నింతయేల
చ్చుఱ మునివర్గ వాహనుఁడవై చనుదెమ్మను మంతఁ
దీఱెడున్. 20

పై పద్యము నాలుగవ పాదమున (త్రచ్చు+అఱ)—(వాహనుఁడ
+ఐ) స్వరయతి.

నిత్య సమాసములుగాని అచ్చంధి ఘటిక శబ్దములకు ఉభయయ
చెల్లదని, ఎచ్చటనైన అట్లు వ్యంజనయతి గూర్ప యత్నించిన అది దో
మగునని అప్పకవి మతము దానినే క్రింద వివరించుచున్నాడు.

ఉ. నన్నయ ముఖ్య సత్కవి జనంబుల కావ్యములంద
లేఖకుల్
గొన్నియుఁ బారకాధములు గొన్నియుఁ బోకడఁబెట్టి
తక్కవై
యున్నవిఁగాంచి జానపదులోడక దిద్దిన తప్పుత్రోవ లె
ల్లన్నిజమంచుఁగైకొని లక్షణవేత్తలు సమ్మతింతురే. 208

వ. అది యెట్లనిన సులక్షణ సారంబునందు లింగమగుంట
తిమ్మన వ్రాసిన యప్రశస్తంబులగు లక్ష్యంబులకు నాశ్చ

ర్యంబు నొంది బహుపుస్తకంబులు పరీక్షించి వానినెల్లను ప్రక్షిప్తంబులుగా నెఱింగినవాఁడనై లక్షణవంతంబులగు పురాతనకవిప్రోక్తంబులు వివరించెద. 203

నన్నయాదుల కృతులలో లేఖకులు కొన్నియు, పాఠకులు కొన్నియు మార్చి వైచిరి. అపైన లక్షణ జ్ఞాన శూన్యులు కొందరు తమకు దోచిన రీతిని పాఠములు కూర్చివైచిరి. లక్షణవేత్తలు ఈ దిద్దుబాటులను కవిప్రయుక్తములని అంగీకరింపరు.

సులక్షణసారమున లింగమ గుంట తిమ్మన అఖండవడికి నన్నయాదుల ప్రయోగములను లక్ష్యములుగా చూపెను. దానికి ఆశ్చర్యపడిన అప్పకవి చాలా పుస్తకములని పరీక్షించి ఆ పాఠములు అప్రశస్తములని, అపపాఠములని అవి నన్నయాదుల ప్రయోగములు కావని, ప్రక్షిప్తములని గుర్తించి లక్షణవంతములగు మూలపాఠములను వివరించుచున్నాడు.

ఆదిపర్వమునందు : (5–135)

క. నా వచనమున నసత్యము
గావించును నీకు గొంతి కడు నెయ్యమున్
నీ వగచిన యా యర్థము
సూావె మనంబునఁ దలంతు సుందరి యెపుడున్. 204

పై పద్యము నాలుగవ పాదమున సూ—సు వ్యంజన యతి.

అప పాఠము :

చూావె మనంబునఁ దలంచుచుండుదు నెపుడున్

చూ—(తలంచుచు+ఉండుదు) యతి గూర్చబడినది.

తలంచుచుండు నిత్య సమాస శబ్దముకాదు. స్వరప్రధాన వడికూర్చ వలసి యున్నది. కాని యట వ్యంజన యతి చేయబడినది. ఇది అప పాఠము.

ఉద్యోగ పర్వమునందు : (2-74)

క. తమతండ్రి భంగి నీకును
సముచితముగ భక్తిఁ జేసి సజ్జన నుత మా
ర్గమునను జరియింపంగా
నమలమతీ కన్నకొడుకు లట్లర యంజనున్. 205

పై పద్యము నాలుగవ పాదమున
(అమల)—(కొడుకులు+అట్ల) స్వరప్రధాన వడి.

అపపాఠము :

............సజ్జనమత మా
ర్గమునఁ జరింపంగా నమ
ల మతి నీ కన్నకొడుకు ల ట్ల రయఁజనున్
(కొడుకులు+అట్ల) అను అచ్చంధిలో లకారముతో వ్యంజన
అఖండ యతి కూర్చబడినది.

అనుశాసనిక పర్వము నందు : (1-68)

క. అతిథి నినుఁగోరె నేనియు
నతిఁ గింకిరిపడ యోల మానపడక నీ
వతనికిఁ బ్రియంబు నలువుము
నతికిఁ బతి పనుపునేయఁ జను నెల్లవియున్. 208

పై పద్యము రెండవ పాదమున (అతి)—(ఓలము+అస) స్వర
ప్రధాన వడి.

అపపాఠము : మతిఁగింకిరి పడక యోలమ్రాన పడక

మ—మ్రా లకు వ్యంజన యతి కూర్చబడినది. ఇది అఖండ యతి.

'ఓలమాన' శబ్దము కావ్యాలంకార చూడామణిలో దేశ్య నిత్య
సమాన యతిగా చెప్పబడినది.

రామాయణమునందు (5–142)

ఉ. అన్నవు తండ్రి యట్ల విను మంతియ కాదటమీఁద రాజవే
మన్నఁ గొంతలేదు మణిహారములాదిగఁ బెక్కుకానుకల్
మున్నుగ సీతనిచ్చి జనలోకపతింగని మమ్ము ప్రోవుమీ
సన్నపుఁ గార్యము ల్వలదు సంధియ మేలటుగాక తక్కనన్ 207

పై పద్యము రెండవపాదమున (ఏమి+అన్న)—హా లకు స్వర ప్రధానయతి.

అపహారము : మన్నఁగొంకలేదు మణిమంతన ముఖ్యములైన మీ-మలకు వ్యంజనముతో అఖండయతి కూర్చబడినది.

మఱియు, దానిలోనే (6-165)

ఉ. ఓ కపివీరులారా సుగు ణోదధి నీరఘురాము సర్వలో
కైక శరణ్యునిం గొలువ నిప్పుడువచ్చితి నొండుగాదు నా
రాక మహాపరాధియగు రావణు తమ్ముఁడ నే విభీషణా
ఖ్యాకుఁడ వీరు నాసచివు లర్క కులాగ్రణితోడఁ జెప్పరే 208

పై పద్యము రెండవ పాదమున (లోక+ఏక)– ఇ లకు వృద్ధియతి.

అపహారము : కైకశరణ్యునిం గొలువఁగా నిట వచ్చితి.

లోక+ఏక లోకైక-సంధంక్షరకై ...గా వ్యంజనములకు అఖండ యతి కూర్చబడినది.

13)

దేవకీ నందనశతకమునందు :

మ. చతురంభోధిపరీత భూవలయు రా జన్యాలి కోటీర రం
జిత మాణిక్యవిరాజితచ్చరణ రా జీవుండు ధర్మాత్మజుం
డతి కార్పణ్యముతో మత్స్యపతిఁ దా నాసింపఁ జే
సీదు శా
శ్వత కారుణ్యము గల్గునంతకును గృష్ణా దేవకినందనా
209

పై పద్యము తొలిపాదమున చ–జ లకు యతి. ఇట సంధిలేదు.
అపపాఠము : చతురంభోధిపరీక భూవలయా రా జానీకకోటీర
రాజు+అనీక–రాజానీక చ-సంధ్యక్షర జాలకు అఖండ యతి.

ఆరణ్య పర్వమునందు (6-357)

చ. ఉరమున రెండుగన్నులు పృథూదర దేశమునందు
నోరు ప్ర
స్ఫురిత భుజద్వయంబును స ముజ్జ్వల దున్నతభావముం
గరం
బరుదుగ నుగ్రమైన వికృ తాకృతితోడ నశేష సత్త్వసం
హరుఁడగుచున్నవాని దివి జారిఁ గబంధుని గాంచి
రచ్చటన్ 210

పై పద్యము నాలుగవ పాదమున హ-(దివిజ+అరి) లకు స్వర
ప్రధానవడి. అపపాఠము: స్మరుఁడగుచున్న దివిజారిఁగ బంధుని

స్మ లోని సకారమునకు - (దివిజ+అరి) దివిజారిలో సంధ్యక్షర
జ కారమునకు అఖండయతి.

ఉద్యోగ పర్వమునందు : (4–140)

అని మది నిశ్చయించి తగ నందఱఁ బిల్వఁగఁ బంచి వారితో
ననిచిన మాటలాడి వినయంబునఁ బ్రార్థనచేసి మీరు మా
కొనరిన సైన్యముల్ పదునొకొంటికిఁ బ్రాభవమాచ
రింపఁ జొ
చ్చిన సకలంబు నొప్ప నభిషేకముఁ గైకొనుఁడుత్స
వంబునన్. 211

వ. దీని మూఁడవ పాదంబునందు 'పదునొకొంటికి' యని యున్నచోట సంధి గూర్చి స్వరప్రధానవడిగాను సోమరాజులు ప్రయోగించినారు. ఇది తెలియక కొందఱు మూఢులు దేశ్యనిత్య సమాసవడియని యనుకొందురు. 212

పై పద్యమున మూడవ పాదమున
(మాను + ఒనరిన)-(పదునొక+ఒంటికి) స్వరప్రధానయతి.

అంతియేకాని కొ-కొ లకు అఖండ యతికాదు. కావున కొందఱను నినట్లు ఇది దేశ్యనిత్య సమాస యతియును గాదు.

## 34. నిత్యయతులు

పని యను నాంధ్రశబ్దము
తో నతికిన పూర్వపదము తుదివ్రాయిక న
చ్చైనను వ్యంజన వర్ణం
బైన రచింపుదురు నిత్య యతులనుచుఁ గవుల్. 213

'ఏని' అను పదము ఉత్తర పదముగానుండి సంధి చేసినపుడు అచట అచ్చునకు గాని, హల్లునకు గాని యతి కూర్పవచ్చును. ఈ ఉభయ యతికి నిత్యయతి అని పేరు.

శేష ధర్మములయందు :

క. మెట్టఁడు నారకమార్గం
బెట్టి మహాక్రూరకర్ముఁ డేనియుఁ దుద ని
ట్టట్టనక నెమ్మనంబున
నెట్టిన హరితలఁపు గలిగె నేని మహాత్మా. 214

పై పద్యము రెండవ పాదమున
(మార్గంబు+ఎట్టి)—(కర్ముడు + ఏనియు) స్వరయతి.
నాలుగవ పాదమున నె—నే లకు వ్యంజన యతి.

## 35. రాగమసంధియతులు

తే. ఆలను పదంబు మొదలను రాగమంబు
వచ్చు సంధికి నుభయంబు వళికిఁ జెల్లు
నతని జవరాలు బాలెంత రాలు ముద్ద
రాలు ధర్మాత్ముపాలన రాక్షసారి 215

ఆలు శబ్దము పరమగునపుడు వచ్చు వు గాగమ సంధిలో ఉభయ యతి కూర్చవచ్చును.

పై పద్యమున మూడవ పాదమున

(అతని)—(బాలెంత+ఆలు) స్వర యతి.

నాలుగవ పాదమున

(ముద్దరాలు) — (రాక్షసారి) వ్యంజన యతి.

మనుచరిత్రమునందు : (2-41)

ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవ రాంద్ర నెపంబిడి పల్కరించు లా
గింతియ కాక నీ వెఱుఁగ వేమునువచ్చినత్రోవచొప్పు నీ
కింతభయంబులేక కడుఁగ నెల్లిద మైతి మె మాటలేటికిన్. 216

పై పద్యము రెండవ పాదమున
(ఏక + అంత) — (జవ + ఆంధ్ర) స్వర యతి.

చారుదేష్ణ చరిత్రమునందు :

క. ఈ లలన వేలుపుంజవ
రాలో యుచ్చరయొ కిన్న ర వధూమణియో
వ్యాళాంగన యో కా కీ
భూలోక స్త్రీల కిట్టి పొంకము గలదే. 217

పై పద్యము రెండవ పాదమున రా-ర లకు వ్యంజన యతి.

రుగాగమమునకు ఉభయ యతి చెల్లునని టు గాగమ, నుగాగమ
ములకు ఉభయ యతి తప్పకని అంగీకరింపలేదు.

## 36. విభాగవళులు

క. తులసీభూషణ సంఖ్యకుఁ
దెలుఁగునఁ బరిమాణ సంజ్ఞ దేటపడుచు ప
ట్టుల నేసి యను పదమునకు
నలరు విభాగవడి యనంగ నచ్చును హల్లున్. 218

సంఖ్యావాచకములకును, పరిమాణమును తెలుపు దోసెడు, మోపెడు

మున్నగు వానికిని విభాగార్థకమగు 'ఏసి' ప్రత్యయము చేరునపుడు ఉభయతి చెల్లును. దీనిని విభాగ వడి అందురు.

కాశీ ఖండమునందు (2-105)

తే. అప్పటికి నియ్యకొంటిఁ గా కంబు జాక్షి
ఋషుల పాలిటివే యింత లేసి వనులు
కొతుక కాఁబోతు నాఁబోతుఁ గుమ్ములాడ
నడిమి యాఁబెయ్యి దెసవచ్చె నాకుఁ జూడ 219

పై పద్యము రెండవ పాదమున
(ఋషుల) — (ఇంతలు + ఏసి) స్వరయతి.

కావ్యచింతామణి యందు :

ఆ. కృష్ణుఁ డిచ్చె నాలు గేసి చీరలు కూర్మి
నింతులకును నాలు గేసి మణులు
తీవితోడ దోసె డేసి మాడలు కడు
నింపెనంగ గంపెఁ డేసి సొమ్ము. 220

పై పద్యము తొలి పాదమున క - గే లకు వ్యంజన యతి.
రెండవ పాదమున ఇ - (నాలుగు+ఏ సి) స్వరయతి.
మూడవ పాదమున తీ — డే లకు వ్యంజన యతి.
నాలుగవ పాదమున ఇ - (గంపెండు+ఏ సి) స్వరయతి.

## 37. నామాఖండవిశ్రమములు

ఆ. అప్ప అయ్య అన అరసవ్వ అమ్మక్క
ఆయి యను పదంబు లదుకు సంధు
లుభయమునకుఁ జెల్లుచుండు నామాఖండ
వళులనంగ నూఁదఁ బడకయైన. 221

అప్ప, అయ్య, అన్న, అరసు, అవ్వ, అమ్మ, అక్క, ఆయి అను పదములు ప్రాతిపదికల చివర చేరి నిత్యసంధిని పొందుచున్నవి. ఈ అప్పాదులు ద్విత్వము లేకుండగను అయ, అన అను విధముగను ప్రయోగములందు కనబడుచుండును. ఇట్టి తావులందు ఉభయ యతి చెల్లును. దీనికి నామాఖండ విశ్రమము అని పేరు. దీనినే అనంతుడు ప్రభు నామాంతక యతి యని, చిత్రకవి పెద్దన ప్రభు యతి యని పేర్కొనిరి.

అప్ప యనుటకు నందితిమ్మన చాటుధార :

క. ఇప్పటి దాతల సరిగాఁ
జెప్పకు రాభట్ట కర్ణ శిబిఖేచరులన్
జెప్పుము మూర్తి ఘనుని వెం
కప్పకు దానమున నిర్భయంబున సభలన్. 222

పై పద్యము నాలుగవ పాదమున
(వెంక + అప్ప) — యలకు సరస యతి.

హుళక్కి భాస్కరుని చాటుధార :

క. అప్పా లిడు నతఁడు ఘనుఁడా
యప్పా డొసఁగి మరలఁ జెందు నాతఁడు రాజా

చెప్పఁగవలె సాహిణి మా
రప్పను దానమున ఘనుఁడు రాజు నటంచున్. 123

పై పద్యము నాలుగవ పాదమున ర — రా లకు వ్యంజన యతి.

అన్న అనుటకు పొట్టూరి గోపన్న :

క. అన్నలుఁడు రూపమున సిరి
యన్న కళాయుక్తి భరతు నన్న కరుణచే
నన్న సముద్రపు పెద చి
న్నన్న కుమారుండు వెంగళామాత్యుఁ డిలన్.

పై పద్యమున నాలుగవ పాదమున
(చిన్న+అన్న) - (వెంగళ+అమాత్య) స్వరయతి.

తెనాలి రామ లింగము :

క. చినన్న ద్విపద కెఱుఁగును
బన్నుగఁ బెద తిరుమలయ్య పదమున కెఱుఁగున్
మిన్నంది మొరసె నరసిం
గన్న కవిత్వంబు పద్య గద్య శ్రేణిన్. 225

పై పద్యము నాలుగవ పాదమున గ-గ లకు వ్యంజనయతి.

తేలఁబలుకుటకు విక్రమార్క చరిత్రమునందు ;

అనఘుఁడు సింగనార్యునకు నబ్బయ గోపయమంత్రి చిక్కనా
రనయును గల్గి రాత్మజులు రాములు మువ్వురుదోఁచినట్లు వె

పున వెలయుంగ నబ్బయ్యకు పుత్త్రిలు పుట్టిరి రామరాజుఁ గే
స నయును బాచరాజు గుణ సంగుఁడులింగనయుం
క్రమంబునన్: 226

తేల బలుకుటయన ద్విత్వము లేకుండ చెప్పుట. ఊదబడినను, ఊదబడకున్నను ఉభయ యతి చెల్లునని చెప్పబడినది.

పై పద్యము రెండవ పాదమున ర-రా లకు వ్యంజన యతి.

నాలుగవ పాదమున స-న లకు వ్యంజన యతి.

అయ్య అనుటకు కాశీ ఖండమునందు : (1-13)

సీ.గీ. నైషధాది మహా ప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకు నా శ్రితుఁడ వనఘ
యిపుడు సెప్పఁదొడంగిన యీ ప్రబంధ
మంకితము సేయు వీర భద్రయ్య పేర 227

పై పద్యము నాలుగవ పాదమున (అంకితము)-(అయ్యా) స్వర యతి.

ఊదబడక యున్నందుకు అనంతుని ఛందమునందు : (1-120)

తే. ఒరుల నమ్మయ్య యనుచోట నూఁదఁబడక
ద్వివిధ మగుఁ బ్రభు నామాంత విరమణంబు
మహి నయోధ్యకు రాజు రా మయ్య యనంగ
నతని పట్టంపుదేవి సీతమ్మ యనంగ 228

ఇది అనంతుని ప్రభునామాంతయతికి లక్షణ లక్ష్యములుకల పద్యము 14)

పై పద్యము మూడవపాదమున మ-మలకు వ్యంజనయతి.
నాలుగవపాదమున (అతవి)-(సీత+అమ) స్వరయతి

రుక్మాంగద చరిత్రమునందు :

ద్వి. శ్రీకర గుణసాంద్ర చిరయశో మంద్ర
ఆకార చంద్ర రా మయ భాస్కరేంద్ర. **229**

పై పద్యము రెండవపాదమున ఆ-(రామ+అయ) స్వరయతి.

అరుసు అనుటకు ఆంధ్ర కవితాపితామహుడు :

క. చేపట్టిన ధ్రువులగుదురు
కోపించిన రంభఁగూడు కొందరు జగతిన్
స్థాపింపఁ బోడవఁజాలని
యాపందలు సాల్వకోన మరుసున కెనరే. **230**

పై పద్యము నాలుగవపాదమున ఆ-(కోనను+అరుసు) స్వరయతి.

పలకలూరి గోపన :

ఆ. గోలకొండ మలక గోవుల భక్షించుఁ
గొండవీటి విప్ర కులము నెల్ల
బాచ మరుసుచేరి భక్షించుచున్నాఁడు
మలక మేలొ బాచ మరుసు మేలొ. **231**

పై పద్యము నాలుగవ పాదమున మ-మ వ్యంజనయతి.

అమ్మ అనుటకు ఈవని పెద్దిరాజు రామరాజు చాటుధార:

క. ఇమ్మహిలో మహనీయ గు
ణమ్ముల నీపాటి గలరె నానావిధ దే

శమ్మల శ్రీరాముని సీ
తమ్మా మాయమ్మ నిత్య హర్షము లిమ్మా. 232

పై పద్యము నాలుగవ పాదమున (సీత+అమ్మ)-హ స్వరయతి.

అతనిదే :

క. ఇమ్మా మదభీష్టంబులు
కొమ్మా మా మ్రొక్కులెల్ల గురుమతితో మా
యమ్మా రఘునందను సీ
తమ్మా సౌభాగ్య సిద్ధి దాయిని వమ్మా. 233

పై పద్యము నాలుగవ పాదమున త-దాలకు వ్యంజనయతి.

అక్క అనుటకుఁ వణుకూరి గురువన్న చాటుధార :

క. ఇక్కలియుగ శక్తులలోఁ
లెక్కింపను భట్ట శంక లేక ధరిత్రిన్
మిక్కిలి మల్లేశుని యం
బక్కకు సరివేల్పు గలదె యవనీ స్థలిలోన్. 234

పై పద్యము నాలుగవపాదమున
(అంబ+అక్క)-(అవనీ) స్వరయతి.

అతనిదే ;

క. చొక్కపు శ్రీగిరి నిలయుని
మక్కువ మతిలో నెఱింగి మనుజులఁ బ్రోవన్
దిక్కయి నిల్చిన మాయం
బక్కకు సరిగలదె సకల భాగ్య స్ఫురణన్. 235

పై పద్యమున నాలుగవ పాదమున బ-భా లకు వ్యంజనయతి.

అయి అనుటకు రావపూఁడి వెంకటయ్య చాటుధార :

క. వ్యాయామ జనిత మారో
పాయ సమస్తాఘములు నివారణ మగు దు
ష్కాయంబు పూతమగు గం
గాయిని బొడగన్నఁదాన మాడిన మాత్రన్. **236**

పై పద్యము నాలుగవపాదమున
(గంగ+అయి) గంగమ్మ-(తానము+ఆడిన) స్వర ప్రధాన యతి.

శమంతకమణి చరిత్రమునందు :

ఉ. కాయవచో మనస్స్థలన కల్పిత దోషములెల్లఁ బాయఁగా
నాయెదలోన నిత్యము సనాతన ధర్మముఁబూని యర్మిలిన్
బాయక కొల్తు రామ నర పాల నిరంతర సౌఖ్యదాయి సీ
తాయి సమస్తశోభన నిధాయి యహోఫల
సిద్ధిదాయిఁగన్. **237**

పై పద్యము నాలుగవ పాదమున తా-ధాలకు వ్యంజనయతి.

## 38. పంచమీ విభక్తి విరామము

ఆ. తత్సమంబుఁ జేయు తఱిని బంచమి కన్న
నంటెనను విభక్తు లదుకు సంధి
మెలఁగు కృతులఁ బంచమీ విభక్తి విరామ
మనఁగ నచ్చునకును హల్లునకును. **238**

కన్నన్, కంటెన్ అనునవి పంచమీ విభక్తి ప్రత్యయములు. అవి ప్రాతిపదికలకు చేరినపుడు (రామునికి+అన్న) (రామునికి+అంటె.) అన్నన్, అంటెన్ వలె అజాదులుగా వినబడుచుండును. అట్టిచోట్ల ఉభయ యతి చెల్లును. దీనికి పంచమీ విభక్తి విరామమని పేరు.

చమత్కార రామాయణమునందు :

క. నిన్నుఁ జెఱిగొన్న హైహయు
కన్నన్ దోర్వీర్య మెక్కు డగు భార్గవు లీ
ల న్నిర్జించిన రాముని
కన్నను శూరుండు మజ్జగంబులఁ గలఁడే. 239

పై పద్యము రెండవపాదమున
(హైహయుకు+అన్న)-(ఎక్కుడు+అగు) స్వరయతి.

నాలుగవ పాదమున క -గలకు వ్యంజనయతి.

ఆదిపర్వమునందు : (2-227)

చ. వితత మఖప్రయోగ విధి విత్తము లుత్తమ ధీయుతుల్జగ
న్నుత సుమహా తపోధనుల నుగ్రహ నిగ్రహశక్తి
యుక్తు లీ
క్రతువున ఋత్విజుల్కమల గర్భసమానులు పూర్వ
దీక్షితి
క్రతువున యాజకోత్తముల కంటెఁ బ్రసిద్ధులు
సర్వవిద్యలన్. 240

పై పద్యము నాలుగవ పాదమున క-కలకు వ్యంజనయతి.

## 39. కాకు స్వరవళులు

క. పలుకుల తలఁగల ప్రాలకు,
వలనగుచోఁ బ్లుతము నిలిపి వానికి రెండున్
వళులుగఁ జెప్పిన గావ్యం
బుల నది కాకుస్వరంబుఁ బ్లుతవళియు నగున్. 241

కొన్ని పదములకు చివర స్వరము కాకువుతో కూడిన దీర్ఘమై యుండును. ఒక్కొక్కటి ఇది ప్లుతముగ కూడ నుండును. ఈ ప్లుత స్వరము పలుకుటకు పట్టు కాలము 3 మాత్రలు. ఇట్టి కాకు స్వరమున్న చోటుల ఉభయయతి చెల్లును. దీనిని కాకు స్వరయతి లేదా ప్లుతయతి అని అందురు.

ఆ. ఏకమాత్ర హ్రస్వ మనుమతింపఁగ దీర్ఘ
మయ్యె మూఁడు మాత్ర లయినఁ బ్లుతము
భీతిశోక తర్క గీత దూరాహ్వాన
సంశయార్థములను జరుగుఁ బ్లుతము. **242**

ఏకమాత్ర లఘువు ద్వీమాత్ర గురువు అనునది ఛందో లక్షణము. భీతి, శోక, తర్క, శోక దూరాహ్వాన, సంశయార్థములందుండు స్వరము ప్లుతము కావచ్చును.

భీతి ప్లుతమునకు భాస్కరుని రామాయణమునందు: (6-41)

ఉ. ఏ జనకాత్మజన్ దశరథేశ్వరు కోడల రాముభార్యఁ జుం
డో జనులార యడ్డపడ రో సురలార సుతారి కంచు నం
భోజదళాక్షి శైలవన భూములు దాఁటుచు భీతినేఁగుచో
నీజల రాశిఁజూచి మది నెంత దలంకెనో
యేమి సేయుదున్ **243**

పై పద్యము రెండవపాదమున
(భార్యఁజుండు+ఓ)-(పడరు+ఓ) ప్లుతయతి.

మనుచరిత్రము నందు : (2-39)

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోటలే
 కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ
 త్రోవదప్పితిం
 గ్రొవ్వున నిన్నగాగ్రమున కుం జనుదెంచి పురంబుఁజేర
 నిం
 కెవ్విధిఁ గాంతుఁ జెప్పఁగదవే తెరువేది శుభంబు
 నీకగున్. 244

పై పద్యము నాలుగవ పాదమున
 (ఇంక+ఎవ్విధి)-(గదవు+ఏ) స్వరయతి.

శోకప్లుతమునకు రామాయణమునందు : (3-2-11 1)

శా. అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధి నే నజ్ఞానినై పల్కితిన్
 నన్నా పాపము వచ్చి ముట్టుకొనియె న్నాపాలి దైవంబవై
 యిన్నిచుంబరిమార్ప వేగఁబఱతే వే నన్ను రక్షింప మీ
 యన్నం గ్రక్కునఁ జీరవే యరుగవే యత్యుగ్ర
 శీఘ్రంబునన్. 245

పై పద్యము మూడవ పాదమున
 (ఇన్నిచు)-(బఱతేవు+ఏ) స్వరయతి.

తర్కప్లుతమునకు హరిశ్చంద్రోపాఖ్యానమునందు : (2-147)

శా. ఓరీ రాజకులాధమా నృపులు లేరో వేఁటరారో మద
 క్రూరాభీల మృగావళిం దునుమరో ఘోరాటవు ల్లేవో నా

యారామంబు గలంచి జంతుతతి మాయంజేసి
యస్మత్కుమా
రీరత్నంబులు వేడవచ్చినను వారిన్నొంచినా వేమిరా.

పై పద్యము తొలిపాదమున ఓ-లేరు+ఓ స్వరయతి.

శాంతి పర్వమునందు : (1-237)

మ. అనుమానింపక శోడఁబుట్టులని కాదా
తుస్మిత్తూఁటాడనెం
దునఁగ్రొన్నెత్తురు లెఱుతై పడవ నింద్రుండుగ్రతన్
దైత్యులన్.
మునుల వ్వీరు భజింపరో క్రతువులా మోదంబుతో
నమ్మహా
త్మునిఁ జేయింపరొ యూర్ధ్వలోక మదికాదో నాక
మూహింపుమా. 247

పై పద్యమున తొలిపాదమున అ-కాదు+ఆ స్వరయతి.

నాలుగవ పాదమున త్ము-దోలకు వ్యంజనయతి.

స్వరయతి, వ్యంజనయతి రెండునుకల ఈ పద్యము కాకు ప్లుత స్వరయతికి మంచి ఉదాహరణమని తెలియదగును.

రంగనాథుని రామాయణమునందు :

ద్వి. అట్టి నామీఁద నీ + కా యలిగెదవు
పట్టి చెట్టలు వాపి + పాఱవై చెదను. 248

పై పద్యము తొలిపాదమున అ-నీవు+ఆ స్వరయతి.

అనుశాసనిక పర్వమునందు : (1-53)

ఉ. ఆ నరనాయకుండొక మహాధ్వర మెంతయు
వేడ్కఁజేయఁగాఁ
బూని మహీసురావలికిఁ బూజయొనర్పఁగఁ
దానుబ్రాహ్మణుం
డై నయమారఁగా ననలుఁడాతని పాలికి వచ్చి నాకు నీ
వే నృప నీదుపుత్రిఁగృప యేర్పడ దానముగాఁగ
నావుడున్. 249

పై పద్యము నాలుగవ పాదమున (ఈవు+ఏ)-ఏ లకు స్వరయతి.

దూరాహ్వాన ప్లుతము :

తే. ఆది తేయార్చితాంఘ్రి పద్మాయనంగ
ద్వారకాపుర మధ్య సద్మాయనంగ
నసుర కులవైరి వీరులారా యనంగ
రసిక చిత్తాబ్జ వాసులారా యనంగ 250

పై పద్యము తొలిపాదమున ఆ—పద్మ+ఆ స్వరయతి.

రెండవపాదమున ద్వా — ద్మా లకు వ్యంజనయతి.

మూడవ పాదమున (అసుర)—(వీరులార+ఆ)స్వరయతి.

నాలుగవ పాదమున ర—రాలకు వ్యంజనయతి.

కళాపూర్ణోదయమునందు । (4-112)

మ. అకటా యేమని దూరుదాన నినునాథా
వేఁగుజామయ్యెఁబోం
దికగాఁ బాదములొత్తర మ్మనుటగాని యొంటియేమో
కదా
నికటక్షోణికిఁ జేర రమ్మనుట గానీ కొంత నెయ్యంపు ఫూ
నికతోఁ గన్నుల విచ్చిచూచుటయు కానీ
లేదొకంతేనియుౝ. 261

పై పద్యము తొలిపాదమున అ—నాథ+అ స్వరయతి.

వంశయప్లుతము :

ఆ. హరియనంగ నాతఁడా నిన్నఁ గంసు న
డంచెఁ గృష్ణుఁ డీతఁడా యశోద
కెంత భాగ్య మబ్బె నే బోటి! నాబోఁటి
నెలఁత కల్లు గలుగు నే తలంప. 262

పై పద్యము తొలిపాదమున హ—ఆతడు+అ స్వరయతి.
రెండవ పాదమున డ—డా లకు వ్యంజనయతి.
మూడవ పాదమున ఎంత—అచ్చెన్+ఏ స్వరయతి.
నాలుగవ పాదమున నె—నేలకు వ్యంజనయతి.

రామాభ్యుదయమునందు : (5-239)

సగంధి. అంగనాలలామఁ గాన వా లతా కుడుంగ మా
తంగమా భుజంగమా పతంగమా కురంగ మా

లుంగమా లవంగ మాతులుంగ మాధవీ నట
ద్భృంగమా వనీరమా శరీరమా సమీరమా. 253

పై పద్యము తొలిపాదమున ఆ—కానవు+ఆ స్వరయతి.

విజయసేనమునందు :

ఉ. వల్లభుఁడేగు దుర్లభుఁడు వాని దెసందగు లూఁది యిమ్మెయిన్
దల్లడమందె దేల యుచిత స్థితికి న్ననుఁ బొసఁజూపినన్
దల్లియు బంధులోకమును దండ్రియు నేమను వారుతింగి రే
నుల్లమ యిట్లు నీకుఁ దగునో తగదో పరికించి చూడుమా

పై పద్యము నాలుగవపాదమున ఉల్లను—తగును+ఓ స్వరయతి.

రామాయణమునందు : (2–258)

క. జనకజకు సుమిత్రానం
దనుకుఁ బ్రణమిల్లి సముచితస్థితి దర్భా
సనమున నుండగఁ రఘుపతి
యనుజన్మని జూచి నేమమా జనపతికిన్ 255

పై పద్యము నాలుగవ పాదమున అనజ—నేమమ+ఆ స్వరయతి.

## 40. ప్లుతయుగ విశ్రామములు

క. తామే వర్ణములైనను
ఖ్యామండలమునను బ్రాణమైత్రి గలిగినన్

దామోదర ప్లుతయుగ వి
శ్రామము లనఁగాఁ బ్లుతాక్ష రద్వయ మమరున్, 256

హల్లులకు మైత్రి లేకున్నను పాదాదియందును, యతిస్థానము నందును రెండును ప్లుతముగల హల్లులున్న యెడల ప్లుతసామ్యముచే పర స్వరము యతి చెల్లును. రెండుచోట్లను ప్లుతమములకు స్వర యతి కుదురుచుండుటచే నిది సాధ్యమగుచున్నది. దీనిని ప్లుతయుగ విశ్రామమని పేరు.

వజ్రపంజర శతకమునందు :

ఉ. శ్రీ గజగామినీ మణిని సీతనుగా నిరపాయిఁగాఁ ద్రిలో
కీ గృహమేధిఁగా గరుడ కేతనుఁగా భవరోగ
వైద్యుఁగా
నా గురువాన నిన్నమది నమ్మితి వేఱొక వేల్పుఁగొల్వనీ
వేగతి కావవే రఘుపతీ శరణాగత వజ్రపంజరా 257

పై పద్యము నాలుగవ పాదమున (నీవు+ఏ) – (రఘుపతి+ఈ) రెండు చోట్లను ప్లుతమున్నది. అచటనున్న హల్లులు వకార, అకారములు పరస్పర మిత్రములుకావు. కాని పైన ప్లుతముండుటచే ఆ ప్లుత స్వర మైత్రి కారణమున ఈ యతి చెల్లినది.

ఈ పండ్రెండును ఉభయవళి భేదంబులు.

ఇంకా ప్రాసయతు లెట్టివనిన :

## 41. ప్రాసయతులు

గీ. గీతముల సీసములను సంగీతములను
విరత విడనాడి యొక్కొక్క చరణమునను

రెంటికిని ప్రాసవర్ణంబు నంటఁ బలుకఁ
ప్రాస విశ్రాంతు లంద్రు క బ్బములవాని 248

పద్యపాదమున రెండవ అక్షరము ప్రాసము అనబడును.

తేటగీతి, ఆటవెలదివంటి గీతపద్యములందును, సీసపద్యము లందును, సంగీతమునందును యతిని విడిచిపెట్టి పాదమునందలి రెండవ అక్షరమునకు దాని మిత్రవర్ణమును యతి స్థానమునకు ప్రక్కన నిలిపి ఆ రెంటికిని ప్రాసమైత్రి కూర్చినచో అది ప్రాసయతి అగును.

ప్రాసయతిలో మైత్రినే చూడవలెను- యతిమైత్రి చూడనక్కఱ లేదు.

ఆ. దేవకీ కుమార గోవర్ధనోద్ధార
తోయజాక్ష పాండ వేయ పక్ష
ఘన వినీలగాత్ర ముని జనస్తుతిపాత్ర
యదు కులాబ్ధిసోమ కదన భీమ 249

1 పా దేవ—గోవ  2 పా తోయ—వేయ

3 పా ఘన—ముని  4 పా యదు—కద

ఇందు 3, 4 పాదములందు న—ని, దు-ద అను హల్మైత్రి కూడి నది, అజ్మైత్రి లేదు. ప్రాసయతిలో ప్రాసలక్షణమేకాని యతిలక్షణము చూడనక్కఱలేదని మీద చెప్పబడినది. ప్రాసనియమమున్న పద్యములలో ప్రాసయతి ప్రయోగింపరాదు. ప్రాసనియమములులేని పద్యములలోనే ప్రాసయతి ప్రయోగింపవచ్చును.

ప్రాసయతి నిర్బంధముకాదు. ఒక పాదమున యతి, మరొక పాద మున ప్రాసయతి ప్రయోగించినను దోషముకాదు.

ఇంతవరకు 7-స్వరయతులు, 21-వ్యంజనాక్షరములు, 12-ఉభయ యతులు, 1-ప్రాసయతి—మొత్తము 41 యతిభేదములు తెలుసుకొంటిరి.

## అగ్రాహ్య విరామంబులు

ఆ. వికటకవులు కొన్ని వింతలు కల్పించి
కవిజనాశ్రయమునఁ గలిపినారు
వానిఁ గైకొనంగ వల, దప్రయుక్తంబు
లేలసెప్పు భీముఁ డెఱిఁగి యెఱిఁగి. **260**

ఇకపై అప్పకవి అగ్రాహ్యములైన యతులను గూర్చి తెలుపుచున్నాడు.

కొంతమంది వికటకవులు స్వీయములయిన కొన్ని వింతలను సృష్టించి వేములవాడ భీమకవి రచితమగు కవి జనాశ్రయమునచేర్చి వేసిరి. వానిని స్వీకరింపదగదు. ప్రామాణికుడగు భీమకవి తెలిసి తెలిసి ఇట్టి అప్రయుక్తములను చెప్పియుండడు. మనకు లభించుచున్న లక్షణ గ్రంథములలో కవి జనాశ్రయము ప్రాచీనమైనది. దీనిని వేములవాడ భీమకవి రచించెను.

వ. అవి యెవ్వియనిన **261**

## అగ్రాహ్యవర్గయతులు

క. వెలయుఁ గకారాదులు భూ
తలమున నైదైదు వళులు దామగుననుచున్
లలనామదనుఁడు రేచన
నలినభవనిభుండు గుణవతంసుఁడు చెప్పెన్. **262**

ప్రతివర్గమునందును ఉన్న కకారాదులు ఐదును తమలో తాము యతి మైత్రిపొందును.

పై పద్యము రెండవ పాదమున

త-ద లకు యతి. ఇది గ్రాహ్యము.

నాలుగవ పాదమున న—త లకు యతి. ఇది అగ్రాహ్యము.

వ. ఈ పద్యములోఁ జెప్పిన యయిదువర్గములయందును మొదలి వర్ణములు నాల్గింటికి వర్గ వళ్ళుగనుకఁ జెల్లు బడి, యవి యన్నియు దాపలఁబూర్ణ బిందువు లేకుండిన ననునాసికములకుం జెల్లవు. ఆ బిందువులున్నట్లాయెనాబిందు యతులు గనుక నవియుఁ జెల్లును. ఈ భేదము చెప్పనందు చేత నీపద్యమగ్రాహ్యము. 263

వర్గ యతి యందు ప్రతి వర్గములోను తొలి నాలుగక్షరములు పర స్పరము యతి మైత్రినందునని చెప్పబడినది. కాని అవి వర్గ పంచమాక్షర ములగు తమ తమ అనునాసికములతో యతి మైత్రినందవు. అట్లు అను నాసికముతో మైత్రినందుటకు వర్గాక్షరములు పూర్ణబిందు పూర్వక ములు కావలసియున్నది. అపుడది బిందుయతి యగునని తెలిసికొని యుంటిరి.

## అగ్రాహ్యసంబంధయతులు

క. దడలకు భేదము లెంచక

వడియును బ్రాసంబు నిలుప వచ్చును గృతులు

డడి యెట్లన్నను శ్రీహరి

దొడిఁబడి దానవులఁజంప దులియాయెనన్. 264

ద, డ లకు యతి మైత్రియు, ప్రాసమైత్రియు చేయవచ్చును.
పైపద్యమున దడ - వడి - దది - దొడి లకు ప్రాస.
నాలుగవ పాదమున దొ-డు లకు యతి.

వ. ఈ చెప్పిన దడలకుంబదాది నున్న చతుర్థవర్గ సరళము ఆదేశమై వచ్చునవుడు ఆదేశయతిగాఁ జెప్ప వచ్చును. అదియుఁ గాక ఆ రెంటికిని దాపలించి నెఱసున్న లున్నప్పు డనుస్వార సంబంధ యుతులు గనుక అటువలెను జెప్పవచ్చును. అవి గలుగఁ జెప్పలేదు గనుక నిదియు సమ్మతముగాదు. 265

చతుర్థవర్గ సరళము_దకారము - దకారమునకు ద కారము ఆదేశ ముగా వచ్చిన ఆ దడలకు యతి మైత్రి చేయవచ్చును. అది ఆదేశ యతి యగును. ఇందు ఆదేశములేదు. కావున ఈ యతి అగ్రాహ్యము.

## అగ్రాహ్యవర్ణ చతుష్టయవళులు

క. యరలవలను నీనాల్గును
వరుసందమలోన వళ్ళు రయమునఁజెల్లున్;
ధర శషసహ వర్ణంబులు,
నరవినొకటి కొకటిచెల్లు హారనిభ రేచా. 266

య ర లవలు అంతస్థములు. ఈ నాలుగును తమలోతాము యతి మైత్రినందును.

అట్లే శ ష సహలు ఊష్మములు ఇవియును తమలోతాము మైత్రి నందును.

పై పద్యము రెండవ పాదమున వ-ర లకు
నాలుగవ పాదమున స-హ లకు యతి.

వ. ఈ మొదలను జెప్పిన యరలవలకు నాల్గింటికిని జెల్లుబడిగాదు. శషసహాలలోపలను తొలుతటివి మూఁడును ఊష్మవిశ్రాంతులు గనుక చెల్లును. వానికి హాకారము చెల్లదు. ఇవి తెలియక చెప్పిన కతంబున ఇదియు అప్రయుక్తమే ఆయెను. 267

య ర లవలు తమలోతాముచెల్లుట లక్షణశాస్త్ర విరుద్ధము. శషసహలలో శ ష స లకు ఊష్మ విశ్రాంతి యను సౌరయతి మైత్రి చెల్లుచున్నది. కాని వానికి హ కారముతో యతిమైత్రి చెల్లదు. ఇట్టియతులు ప్రయోగార్హములుకావు గాన అగ్రాహ్యములు.

## అగ్రాహ్యభేదవర్గయతులు

క. ధరఁబఫ బభ మాక్షరములు
పరువడి నీయేనుగూడ వాతోఁజెల్లున్
సరి సంభావన వడియన
మరు దీమము లేమ కీర వాణియనంగన్ 268

ప వర్గాక్షరములు పఫ బభ మ అను నీ ఐదక్షరములు వకారముతో యతిమైత్రి నందును. దీనికి 'సంభావన యతి' అని పేరు.

పై పద్యము నాలుగవ పాదమున మ-వ లకు యతి కూర్చబడినది

వ. పంచమ వర్గాక్షరము లైదింటిలో నున్న వబఁక భేదయతి గనుకను ప్రథమ ద్వితీయ చతుర్థవర్ణములు వకార

మునకు నభేదవర్గయతులు గనుకను అవియు నిలుచును; మకారము నడవదు. ఇది విచారించక చెప్పినాఁడు గనుక నిదియు అబద్ధమని తెలిసికొనునది. **269**

పంచమ వర్గాక్షరములు ప ఫ బ భ మ. ఈ ఐదింటిలో వ బ లకు అభేద యతి చెల్లుచున్నది. అభేదవర్గయతిచే ప ఫ, భలకు వకార ముతో యతిమైత్రి చెల్లుచున్నది. కాని మకారమునకు ప, ఫ, బ, భలకు యతిమైత్రి లేదు. బిందుపూర్వక మగుచో చెల్లుచున్నది. 'మవర్ణ విరామము'చే బిందుపూర్వక వకారము,మకారముతో యతిమైత్రినందుచున్నది. అంతియేకాని ప-నులకు యతిమైత్రికాదు. కావున అగ్రాహ్యము

తే. భరితభువనార్ణవంబుతో ప్రవంత సరియె
రమ్యమణి రాజరాజితో లక్క-సరియె
లలిత వీణారవంబుతో ఢక్క- సరియె
యనఁగఁజెలు నభేదాఖ్య నమరువళ్ళు **270**

పై పద్యమున అభేద విరతికి ఉదాహరణము లీయబడినవి.
తొలి పాదమున భ-వ లకు
రెండవ పాదమున ర-ల లకు
మూడవ పాదమున ల-ఢ లకు యతిమైత్రి చేయబడినది.

వ. ఈ మూఁటిలోపలను భకారవకారములకు నభేదవర్గ విరతిగనుకఁ బ్రయోగించవచ్చును. లవర్ణ ధవర్ణములకు నభేద వర్గ యతులుగావు గావునఁ బ్రయోగింపరాదు. రవర్ణము నకును లకారమునకును గ్రాహ్యంబుగాదు, వానికిని లక్షణ విలాసమువారు తెలియక కొన్ని యుదాహరణంబులు వ్రాసినారు; అవియును వివరించెద. **271**

పై ఉదాహరణములలో భ-వ లకు 'అభేదవర్గయతి' చెల్లుచున్నది. ర-ల, ల-ఢలకు యతిమైత్రికాదు. కావున తొలిపాదమున యతిమైత్రి గ్రాహ్యము. 2, 3 పాదముల యతిమైత్రి అగ్రాహ్యము.

శృంగార నైషధమునందు: (1-110)

క. కైలాటరాయ యభినవ
లీలామకరాంక చంద్ర రేఖాంకుర చూ
డాలంకార బదాంబురు
హాలింగిత సుఖిత నిర్మలాంతఃకరణా 272

పై పద్యము రెండవ పాదమున ల-ర ల లకు యతిమైత్రి చేయబడినది.

రామాయణమునందు; (6-2323)

క. దానవ సుందరులత్తఱి
జానకి నందలముమీఁద నమ్మొద మొదవం
గానిలుప శారదాభ్ర వి
లీనత నేపారుచంద్ర రేఖయుఁపోలెన్ 273

పై పద్యము నాలుగవ పాదమున ల-ర లలకు యతిమైత్రి చేయబడినది.

వ. సంస్కృతమునందు రేఖాలేఖాశబ్దములు రెండును గలవు గాన నీరెండు పద్యములయందును జెప్పిన లేఖా శబ్దము మొదలిది తృతీయాంతస్థమని యెఱుఁగునది. 274

రేఖకు లేఖ రూపాంతరము. య ర ల వ అంతస్థములు. ర ద్వితీయాంతస్థము. లతృతీయాంతస్థము. ర స్థానమున ల గ్రహించిన అగ్రాహ్య

మగు ర ల యతి చేయనక్కఱలేదు. యతిస్థానముననున్నది ల యే కాని ర కాదు అని అప్పకవి అభిప్రాయము.

హరిశ్చంద్రుని కథయందు :

ద్వి. చీఁకటి విరియించు జిఱునవ్వుపసిఁడి
రేకులతో నెదిరించు చెక్కులును 275

పై పద్యమున రే-రిలకు యతి. ఈ పద్యము గౌరన హరిశ్చంద్ర చరిత్రలోనిది.

వ. కొందఱు 'రేకులతో మురాళించు చెక్కులును' అని చదువుదురు, అది వ్రాఁతతప్పుగాని కవి హృదయము గాదు. 276

కొందఱు ర-ళ లకు యతిమైత్రి చేయుచుందురు. ఇది సరిగాదు అని అప్పకవి పై పద్యమున సరియగు పాఠమునే చేర్చియున్నాడు.

వసు చరిత్రమునందు ; (3-16?)

శా. ఓలంబాలక యోలయోలయన నోలోలంచు
మేలంబునన్
లోలంబాలక యోర్తు గ్రుంకి బిసవల్లుల్దున్మితూఁ
టాడి కెం
గేలంబూని తటాలునన్నగసెన శ్రీణాంబునాథాంబుజా
శ్రీలోకంబు జయించి వారలయశః శ్రీఁదెచ్చు
చందంబునన్ 277

పై పద్యము రెండవ పాదమున ల-ల లకు యతి.

వ. ఈ పద్యము రెండవ చరణము మొదలను 'లోలం

బాలక గుంకి' యని కవి హృదయము ఇదిగానక కొందఱు 'ఇందిందిరశ్చంచరీకో రోలంబో బంభరోపిచ' అని నిఘంటువ నున్నదని 'రోలంబాలక' యని చదువుదురు, ఇటని రామ రాజ భూషణుని తలంపుగాదు. 278

పైపద్యమున కొందరు 'లోలంబాలకన్' యనిగాక తుమ్మెదయను అర్థమున' రోలంబాలక' యని చెప్పుదురు. ర-ల యతికూడని దగుటచే 'లోలాంబక' అనియే గ్రాహ్యమని అప్పకవి అభిప్రాయము.

క. నణలను రెండక్కరముల
కునువడిఁ బ్రాసంబుఁ బెట్టుకొనవచ్చుఁ గృతిన్
వినుఱరల (రఱల) కిట్లఁ బెట్టం
జను, లళల కభేదమరయ స్వరజ్ఞనిధీ. 279

న,ణలకు; ఱ,రలకు, ళ,ళలకు యతి ప్రాసములు కూర్పవచ్చునని అందురు.

వ. ఈ చెప్పిన మూఁటిలోపలను మొదలఁజెప్పిన న ణ ల కును నరసవడియుఁ గడనుజెప్పిన ల ళ ల కభేదవిరతియు గనుక నీ రెంటను గూర్పవచ్చును; నడుమను జెప్పిన ర ఱ ల కు 'తయోస్తు నిత్యంస్యాత్' అని శబ్దశాసన సూత్రం బలిమింజేసి యేక తర యతు లగుటనుంగూర్ప రాదు; అటుగాన నీ పద్యమును బ్రశస్తముగాదు. 280

న-ణలు నరసయతిచే చెల్లుచున్నవి. ల-ళలు అభేదయతిచే చెల్లు చున్నవి ర-ఱలకు యతిమైత్రిలేదు. ర,ఱలు రెండును యతి ప్రాసలవిష యమున మైత్రి పొందవని వ్యాకరణమతము. ఈ రెండక్షరములు ఏకతర

యతికి చెందుచున్నవి. ఏ యక్షరమున కాయక్షరమే యతి మైత్రినందునని ఏకతరయతి (85)లో చెప్పబడినది. కావున ర-అలకు యతిమైత్రి అగ్రాహ్యము.

# ప్రాసము

## ప్రాస స్వభావము

ఇంకఁ బ్రాస స్వభావం బెట్టి దనిన

మూ. సూ. ద్వితీయోవర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు
కించ ప్రాస స్సర్వేషు చైక ఏవస్యాత్.

పద్యములందు ప్రతిపాదమునందును రెండవ అక్షరమునకు ప్రాస మనిపేరు. అన్ని పాదములందును ఆ ప్రాసాక్షరము ఒక్కటిగనే ఉండవలెను.

తే. ప్రథమపాద ద్వితీయాక్ష రంబు ప్రాస
మయ్యెఁ బదపద్యముల నదు గడుగునందు
నదియు రెండవ వర్ణమై యమరు సీస
గీత దండక మంజరీ కృతులఁ దక్క. 281

తొలిపాదము రెండవ అక్షరము ప్రాసము. పదములందును, పద్యము లందును ప్రతిపాదమునందును రెండవ అక్షరము తొలిపాదము రెండవ అక్షరమే అయి ఉండవలెను.

సీసము, గీతము(తేటగీతి, ఆటవెలది), దండకము, మంజరీ ద్విపద అను పద్యములందు ప్రాసనియమములేదు.

సీసము, తేటగీతి, ఆటవెలది ఇవి ఉపజాతులు. వీనికి ప్రాసనియమములేదు. దండకమునకు యతిప్రాసలులేవు. మంజరీకూడా ద్విపదయే. ద్విపదకు ప్రాసనియమము కలదు. మంజరికి ప్రాసలేదు. సంస్కృత శ్లోకములకు ప్రాసనియమములేదు.

పద్యపాదమున రెండవ అక్షరమనగా తొలి అచ్చుమీది రెండవ అచ్చుతో కూడిన వర్ణములేక వర్ణ సముదాయము అని గ్రహింపవలెను.

## ప్రాస పూర్వాక్షర నిర్ణయము

క. గురు లఘువులలో నెయ్యది
మురహార తొలిచరణమునకు మొదల నిలుచు ని
ద్ధర నాపై నిడు ప్రాసా
క్షరములఁ బూర్వమున నదియ కదియింప నగున్. 282

తొలిపాదమున తొలి అక్షరము గురువైన తక్కిన పాదములందును తొలి అక్షరము గురువే నిలుపవలెను. అట్లు లఘువైన లఘువునే నిలుపవలెను. ఒక పాదమున తొలి అక్షరము గురువు వేరొక పాదమున లఘువు నిలుపరాదు.

ప్రాసయతికిని ఈ నియమము పాటింపవలెను.

ఆ. దాన పారజాత వాసవా వరజాత
ఘన ఘనాఘనాంగ దనుజగర్వ
భంగ యనుచునిట్లు ప్రాసాదులను గూర్ప
వలయు నొక్కభంగి ప్రాలు కృతుల 283

పై పద్యమున తొలిపాదము
ప్రాసకు పూర్వాక్షరములు దా-వా గురువులు.
రెండవపాదమున
పూర్వాక్షరములు ఘ—ద లఘువులు

ప్రాసయతికిని ఈ నియమము పాటింపవలెననుటకే అప్పకవి ఆట వెలది నుదాహరించెను.

గురువనగా పూర్ణబిందువుతో కూడినవి, విసర్గ అంతమందు కలవి, దీర్ఘాక్షరములు 'సంయుక్త, ద్విత్వాక్షరములుముందున్నవి; పొల్లు హల్లుతో కూడినవి అగు వర్ణములు. లఘువనగా హ్రస్వాక్షరములు.

ఆ. క్రింద జడ్డలను బి ఋంద బిందువులును
నూఁది ప్రాసములకు నుండెనేని
హ్రస్వమొకటి నిడుద యక్కరం బొక్కటి
వాని మొదల నిలుప వచ్చునెందు. 284

ప్రాసాక్షరము సంయుక్తమైనను, ప్రాసమునకు ముందు పూర్ణబిందు వున్నను ప్రాసపూర్వాక్షరము ఒకటి దీర్ఘము వేరొకటి హ్రస్వము నుండ వచ్చును. కాని గురువగుచో గురువును, లఘువగుచో లఘువును కావలె నను పూర్వ నియమము మాత్రము పాటింపవలెను.

ఆ. పక్షిరాజ పత్ర రాక్షస తృణ దాత్ర
దంతి భయ విరామ శాంతి ధామ
యింద్ర నీలమూర్తి సాంద్ర పాండుర కీర్తి
యనఁగఁ బ్రాసమాత్ర కాదు లోప్ప. 285

పై పద్యము తొలిపాదమున (పక్షి—రాక్ష) ప్రాస పూర్వాక్షరములు ఒకటి హ్రస్వము, ఒకటి దీర్ఘము కాని సంయుక్తాక్షరములగుటచే పూర్వా క్షరములు రెండును గురువులు.

రెండవ పాదమున (దంతి—శాంతి) పూర్ణబిందు పూర్వకమయిన హ్రస్వ, దీర్ఘము రెండును గురువులు.

మూడవపాదమున (ఇంద్ర-సాంద్ర) పూర్ణబిందు పూర్వక సంయు క్తాక్షరము పరముగానుండుటచే పూర్వాక్షరములు రెండును గురువులు.

ఆ. వేతవేద్య యసమ వృత్త పాదములను
ప్రాస నియమరహిత పాదములను
వలసినట్లు మొదలి వ్రాలు సెప్పగ నొవ్వ
నొక్కచోన గురువు నొకట లఘువు. 286

ప్రాస పూర్వాక్షర నియమమునే మరికొంత వివరించుచున్నాడు. అసమవృత్త పాదములందు, సీసము, గీతము వంటి ప్రాసనియమము లేని పద్యపాదములందు ఈ ప్రాసపూర్వాక్షరనియమము ప్రవర్తింపదు. కావున తొలిఅక్షరము ఒక పాదమున గురువు, వేరొక పాదమున లఘువు కావచ్చును.

స్వస్థానార్ధ సమవృత్తోప జాతి వృత్తము :

క్షమా కళత్రున్ వనజాత నేత్రున్
గా మేపలీశున్ ద్విజగ త్ప్రకాశున్
తమాల నీలున్ సముదార శీలున్
హేమాక్షవైరిన్ భజియింతు శౌరిన్. 287

పై పద్యము ఉపజాతి. ఇందు బేసి పాదములందు ఉపేంద్ర వజ్ర వృత్తము.

(జ,త,జ,గగ) సరిపాదములందు ఇంద్ర వజ్రవృత్తము (త, త, జ,గగ) నడచును. కావున ఇది అర్ధసమవృత్తము. ఈ రెండు వృత్తములు 11వ ఛందమున పుట్టినవి. కావున స్వస్థాన వృత్తమైనది. అనగా పాదమునకు 11 అక్షరములు—1,3 పాదములు జగణముతో ప్రారంభమగుటచే తొలి అక్షరము లఘువు. 2,4 పాదములు తగణముతో ప్రారంభమగుటచే తొలిఅక్షరములు గురువులు. ప్రాస పూర్వాక్షరనియమిట వర్తింపదు.

క్ష-కా-త-హే లందు 1,3 లఘువులు, 2,4 గురువులునగుచున్నవి.

ఆ, వారిజాతగర్భ వామదేవ సహస్ర
నయన ముఖ్యపుణ్య నామ యనుచుఁ
బ్రాసనియతి లేని సీసాది పదముల
మొదల రెండు నిట్లు గదియుచుండు. 288

పై ఆటవెలది పద్యమున ప్రాసనియమములేదు. (వా-నా-ప్రా-మొ) పాదాద్యక్షరములకు ప్రాసపూర్వాక్షర నియమము పాటింపబడలేదు.

పద్యము రెండవ సగమున ప్రాసయతి పాటింపబడినది. కావున పూర్వాక్షర నియమము అవశ్యకమైనది. (ప్రాస—సీసా, మొద-గది) పూర్వాక్షరములు. ఒక పాదమున గురువులు, వేరొక పాదమున లఘువులు అయినవి.

## ప్రాసాక్షర మైత్రి

తే. ప్రాసముల కెల్లఁ దుల్యాక్షరంబు లైనఁ
జాలు స్వరభేదమైన దోషంబు లేదు,
చరణముల కడగూర్చు ప్రాసముల కెల్ల
నన్నియు సమస్వరంబు లై యమరవలయు. 289

ప్రాసయందు హల్లు సమానముగానున్న చాలును. స్వరభేద మున్నను అది దోషముకాదు. అనగా తొలిపాదమున ప్రాస స్థానమున నున్న హల్లే మిగిలిన పాదములందు ప్రాస స్థానమునందుండవలెను. అంత్యానుప్రాస గూర్చునపుడు మాత్రము అన్ని పాదములందును హల్సామ్యమేకాక సమస్వరమును ఉండవలెను. అనగా పాదాంతాక్షరములు సమ స్వరములై అన్నియు ఒక్కటిగనే ఉండవలెను.

ఆ. సరసిజాతనేత్ర దురిత గుల్మలవిత్ర
హరితనుజ మిత్ర గరుడ పత్ర
ధారుణీ కళత్ర నీరదాసిత గాత్ర
యనుచుఁ గూర్పవచ్చు నచ్చు లెల్ల. 290

పై పద్యమున 1 సర—దురి 2 హరి—గరు 3 ధారు—నీర ఇట్లు మూడు పాదములందును రేఫమే ప్రాసముగా నిలుపబడినది. స్వరములొక్కటికాదు. భేదము పాటింపబడినది. ప్రాసపూర్వాక్షర గురులఘు భేదమును ప్రయోగింపబడుట గ్రాహ్యము.

ఈ పద్యమున తొలి మూడు పాదములందును అంత్యానుప్రాసము పాటింపబడినది. 1 నేత్ర—విత్ర 2 మిత్ర—పత్ర 3 కళత్ర—గాత్ర.

ఇట హల్సామ్యము, సమస్వరము కూడా పాటింపబడినది.

క. దురిత ద్విపహర్యక్షా
నరక మురాసుర విపక్ష నాళీకాక్షా
శరది సుతాలయ వక్షా
కరినాయక రక్ష హరముఖ సురాధ్యక్షా. 291

ఇది అంత్యాను ప్రాసమును గూర్చి చెప్పుటకు ఉద్దేశింపబడినది.

1 హర్యక్ష 2 నాళీకాక్ష 3 వక్ష 4 అధ్యక్ష

అంత్యప్రాసము క్షకారము చూపబడినది. ఇందు కొన్ని హ్రస్వాంతములు, కొన్ని దీర్ఘాంతములు నుండుట గ్రహింపవలెను.

తే. వట్రువయు ద్విత్వమును గల వ్యంజనంబు
ప్రాసమై యుండునెడఁ బెఱ ప్రాసములకు
వ్యంజనంబు సమాక్షరం బైనఁ జాలు
వానిపై నేస్వరంబైనఁ బూనవచ్చు. 292

వట్రువయన్న ఋకారము-ౠకారము, రేఫవలె పలుకబడుచున్నను అది అచ్చే అగునుగాన ఋకారముతో గూడిన హల్లు ప్రాసస్థానమునందు న్నపుడు మిగిలిన చోట్ల ఏ ఇతర స్వరమున్నను ప్రాసాక్షరమునందున్న హల్లులు సూనముగా నుండవలెను. వానికి ప్రాసము చెల్లును.

ఈ విధి ద్విత్వమునకును చెల్లును. ఒకపాదమున ఋత్వముతో కూడిన ద్విత్వాక్షరము ప్రాసస్థానములోనున్న తక్కిన ప్రాసస్థానములలో ద్విత్వాక్షరమున్న చాలును. వానిపై సమస్వరము పాటింపనక్కఱలేదు, ఋకారమును నుండనక్కఱలేదు.

ఆ. సకియ పూర్వజన్మ సుకృత ఫలంబునఁ
గాక తను విభాని రాకృతాభ్రు
నిక్కృపా పయోధి దక్కఁగఁ గొనుటకుఁ
దరమె భోజసుతకుఁ దక్కఁ నఁగ. **293**

ఇందు 1 సకి—సుకృ 2 గాక—రాకృ 3 నిక్కృ—దక్క

ఈ పద్యమున మొదటి రెండు పాదములందును ప్రాసయతిగానున్న అక్షరము కృ ఋకారముతో కూడినది. వీనికి ప్రాసస్థానమున సమ వ్యంజనమున్నది. సమస్వరములేదు.

మూడవపాదమున ఋకారముతోకూడిన ద్విత్వాక్షరమునకు ఇతర అచ్చుతో కూడిన అదే ద్విత్వాక్షరమునకు ప్రాసయతి కూర్పబడినది.

శల్య పర్వమునందు : (1-14)

క. చావరు నొవ్వరు పాండవు
లేవురు నని నీవు సెప్ప నిప్పలుకులు దుః
ఖావేశ కరములై చే
తోవృత్తిఁ గరంపఁజొచ్చె దుర్భర భంగిన్. **294**

ప్రాస నాల్గుపాదములందును వకారమేయున్నది. స్వరభేదము ఇది. ఋకారము చివరి పాదమున మాత్రమే యుండుట గ్రాహ్యము.

కవికర్ణ రసాయనమునందు : (1-64)

మ. అమరీ విభ్రమ రీతి లోల నయనా హస్తాబ్జ దోధూయమా
న మణీదండక చామరాగ్ర పవమాన స్పందనాందోళన
క్రమ శోభాన్నృపకుండల ప్రకర ము త్కర్షాప్తి మయ్యెందదీ
యమృదు స్పర్శ సుఖోన్నతిం బరవశం బై తూఁగుచుండం బునన్. 295

ఇందు ప్రాసమున మకారమున్నది. నాలుగవపాదమున మాత్రము ఋకారమున్నది.

క. విరమము స్వర ప్రధానము
తరఁ బ్రాసము వ్యంజన ప్రధానము నగుటన్
స్వరసంధిఁ జెందునపుడును
బరుచిరముగ హల్లు దాన ప్రాసము లయ్యెన్. 296

యతియందు అచ్చు ప్రధానము. ప్రాసమునందు హల్లు ప్రధానము. కావున స్వరసంధి చేయునపుడును ప్రాసమున హల్లునకే మైత్రి పాటింప వలెను. యతికివి వలె సంధిలేర్పరచుట సాధ్యమునుకాదు. చేయనురాదు!

క. అసలు వెట్టిన నిలువక
తా నూరక యలిగి యాసు దంతను జేరెన్
దానవ సంహారుఁ డక్రియ
చే నిఁకఁ జను దెంచు నాకుఁ జెప్పవె యనంగన్. 297

పై పద్యమున నాల్గుపాదములందును నకారమున్నది. 1,3 పాదము లందలి నకారము సహజ సిద్ధము. 2,4 పాదములందలి నకారము సంధి గతము. అట్టి తావులందు యతి విషయమున స్వరప్రధానవడి చేయవలెను. కాని ప్రాసమున స్వరమునకు గాక వ్యంజనమునకే మైత్రి కూర్పవలెను.

ఈ నియమము స్వర సంధి విషయముననే గాక వ్యంజన సంధి విషయమునను కూడా పాటింపవలెను.

## ప్రాస భేదములు

సీ. అర్ధబిందు సమా వ్యాయముఁ బూర్ణబిందు, ఖం
డా ఖండములు, సంయుతాక్షరంబు
ధర సంయుతా సంయుతము, రేఫయుత, లఘు
ద్విత్వ, వికల్పముల్, వెస నుభయము,
ననునాసిక ప్రాసమును, ప్రాసమైత్రియుఁ,
ప్రాసవైరంబు, స్వ వర్గజంబు.
బు ప్రాస, లఘు యకార ప్రాసములు నభే
దంబును, నంధిగతంబు ననఁగ..

తే. బదియు నేడు తెఱంగులఁ బరిఢవిల్లు
ప్రాసములు పూర్వసుకవి ప్రబంధములను
క్రమత లక్షణలక్ష్య యుక్తంబు గాఁగఁ
దేటపఱచెద వాని నిశాట దమన. 298

ఈ ప్రాసభేదములు 17 రకములు.

1 అర్ధబిందు సమప్రాసము  2 పూర్ణ బిందు సమప్రాసము
3 ఖండాఖండ ప్రాసము  4 సంయుతాక్షర ప్రాసము

5 సంయుతా సంయుత ప్రాసము 6 రేఫయుత ప్రాసము
7 లఘుద్విత్వ ప్రాసము 8 వికల్పప్రాసము
9 ఉభయప్రాసము 10 అనునాసిక ప్రాసము
11 ప్రాసమైత్రి ప్రాసము 12 ప్రాసవైరము
13 స్వవర్గజ ప్రాసము 14 ఋప్రాసము
15 లఘు యకారప్రాసము 16 అభేదప్రాసము
17 సంధిగత ప్రాసము.

ఈ ప్రాసభేదములకు ఉదాహరణ ప్రదర్శనము సుకరముగాన అప్పకవి తేటగీతి ఆటవెలదులలో ప్రాస యతులకు ప్రయోగములిచ్చుచున్నాడు.

## 1. సమప్రాసములు

తే. పూర్వమున నర్ధమైనను బూర్ణమైన
దిగువ జడ్డక్కరంబైనఁ దగిలి మొదలి
ప్రాసముండిన యెడ సమ ప్రాసమనఁగఁ
బిదప నన్నియు నట్లన గదియవలయు. 299

పద్యములలో తొలిపాదమున ప్రాసాక్షరమునకు పూర్వము అర్ధబిందువు గాని, పూర్ణబిందువు కాని ఉండిన మిగిలిన పాదములందును అట్లే ఉండవలెను ప్రాసాక్షరము ద్విత్వము కాని, సంయుక్తము గాని అయినచో అన్నిటను అట్లే ఉండవలెను.

### 1. సమప్రాసము లందర్ధ బిందుప్రాసము
(అర్ధబిందు సమప్రాసము)

ఆ. పీఁకఁ బంక్తిముఖుని దాఁకి కోసలవల్ల
భుఁడు బలాసురాంత కుఁడు సెలంగ

నవనిఁ గూర్చె ననుట నర్ధబిందు ప్రాస
పట్లు గూర్పవలయు నెల్ల కడల. 300

పై పద్యము 1 పా వీఁక—దాఁకి 2 పా ఘుఁడు—కుఁడు

తొలి పాదమున ప్రాసాక్షరము కకారము. ప్రాస, యతి స్థానము లకు పూర్వము రెండు చోట్లను అరసున్నయున్నది.

రెండవ పాదమున ప్రాసాక్షరము డకారము. రెండుచోట్లను అర సున్న యున్నది.

మొదటి పాదమున అరసున్న దీర్ఘ పూర్వకము. రెండవపాదమున హ్రస్వపూర్వకము.

## 2. పూర్ణబిందు (సమ)ప్రాసము

క. పొందింపవలయు నెల్లెడ
బృందావనచారి పూర్ణ బిందు ప్రాసం
బిందీవరాక్షి భీష్మక
నందనఁ జేకొనియె నంద నందనుఁడనఁగన్. 301

పై పద్యమున ప్రాస పూర్వాక్షరము పూర్ణబిందువై యున్నది. నాలుగు పాదములందును అట్లే యుండుట నిది పూర్ణబిందు సమప్రాసము.

### ఖండాఖండ ప్రాసములు

క. నిడుపులు నరసున్నలు దమ
కెడమనుగల క చ ట త ప ల కిలఁ బ్రాసములై
దొడరును నిర్బిందువు లొ
క్కెడ ఖండాఖండ సంజ్ఞ నిన శశినయనా. 302

ఇది అర్ధబిందు ప్రాసమున కపవాదము. అర్ధబిందు ప్రాసమున అన్ని పాదములందును ప్రాస పూర్వము అర్ధబిందువు వుండవలెను. కాని ఖండాఖండ ప్రాసమున దీర్ఘము మీద అర్ధబిందువు పూర్వమందు కలిగిన క, చ, ట, త, ప లకు, అర్ధబిందువు పూర్వమున లేని క, చ, ట, త, ప లకు ప్రాసము చెల్లును.

ఆదిపర్వమునందు : (8-203)

క. పీఁకఁ బఱతెంచి నల్గడఁ
దాఁకినఁ గడు నలిగి ఘోర తర శరహతి న
మ్మూకలు విరియఁగ నర్జునుఁ
డాఁకరమున నేసె నుగ్రుడై రణభూమిన్. 303

పై పద్యమున ప్రాసాక్షరము కకారము. 1, 2, 4 పాదములు ప్రాసాక్షరమునకు పూర్వము దీర్ఘము మీద అర్ధబిందు యుతములు. 3వ పాదము ప్రాసపూర్వము దీర్ఘమేకాని బిందు పూర్వము కాదు.

విరాటపర్వమునందు : (2-271)

క. నాకోఁఱఁత దీర్చి వచ్చితి;
నీకోఁఱఁతయు యింక నూతు నిం దెగఁజూడన్
లోకము వంచింపంగఁ దగు
చీఁకటి రేయొదవె నేమి సేయుదొ చెపుమా. 304

పై పద్యమున తొలి మూడు పాదములును ప్రాసపూర్వము దీర్ఘాక్షరములు. నాల్గవ పాదమున దీర్ఘము మీద అర్ధబిందువును కలదు.

ద్రోణపర్వమునందు (2–136)

సీ.పా. మూఁకలు విరియించి వీఁక నాచార్యాది
  యోధుల కెల్లను నొక్కడెసను. 305

పై పద్యము తొలి సగమున ప్రాస యతి యున్నది. అది ఒక చోట విర్బిందుకము, ఒకచోట సబిందుకము నయి యున్నది.

రుక్మాంగద చరిత్రమునందు (4–99)

ఓ కరుణాకలాప వికచోత్పలలోచన యిప్పు డిమ్మెడన్
గాకులు చంపకుండ ననుఁ గైకొని కాచిన నీ కృపా గుణం
బే కలిగె న్వసింపఁదగు నే తొలి పుట్టువునందు భర్తపైఁ
గాఁకులు సేసినట్టి ఘన కల్మషముల్ విన నీకుఁ జెప్పెదన్. 306

పై పద్యమున తొలి మూడు పాదములందును ప్రాసపూర్వములు బిందుయుతములు కావు.

నాలుగవ పాదము అర్ధబిందువుతో కూడి యున్నది.

ఆదిపర్వమునందు :

మత్త. తీఁగ యుయ్యెలల నూఁగుఁ జల్లని తియ్యమామిడి మోకలం
  దాఁగుఁ బువ్వుల తేనెసోనలఁ దారుఁగేతకిఁ జేరుఁ బు
  న్నాగపూగ మహాగవీథుల నాట్యముల్ పచరించు నా
  భోగ నాగలతా గృహంబులభోగముల్గను వేడుకన్ 307

పై పద్యమున తొలిసగము ప్రాసపూర్వము బిందుయుతము. రెండవ సగము బిందుయుతము కాదు. ఇవి ఖండాఖండ ప్రాసము.

అప్పకవి కచటతపలకు (302) మాత్రమే ఖండాఖండ ప్రాసము చెప్పి ఇచట గకారమునకు కూడ ఉదాహరణము నిచ్చుటచే సరళములకు కూడా ఖండాఖండ ప్రాసము చెల్లునని గ్రహింపవలెను. పురుష సరళము లకు ముందు బిందువున్నను, లేకున్నను ప్రాసమైత్రి చెల్లునని తాత్పర్యము.

రంగనాథ రామాయణమునందు :

ద్వి. మూఁగి చరించు న మ్మొకరి తుమ్మెదలు
బాగొప్పఁ గొప్పనఁబరఁగిన దాని 308

పై ద్వీపదలో తొలిపాదము బిందుయుతము, రెండవపాదము బిందు యుతముకాదు.

వరాహ పురాణమునందు :

క. ఆ చింతామణి ముని తన
వేఁచ మడఁచు దాఁక నీక పృథు లోభముచే
దాఁచుకొనుఁగాక నాచే
నీచే నిఁక మోసపోవు నే నరనాథా 309

పై పద్యమున 1, 4 పాదములందు ప్రాసపూర్వము బిందుయుతము కాదు. 2,3 పాదములు బిందుయుతములు.

ఉద్యోగపర్వమునందు : (4-407)

క. మీటు గతి రథికులను నొక
నాఁటికి వేవుర వధింతు నరుశరములు నో
నా టివడ వైచు నంతకు
వేఁటాడెదఁ బ్రబలబలంబు పీనుల నెల్లన్ 310

పై పద్యమున 1,3 పాదములందు ప్రాసపూర్వము బిందుయుతము కాదు. 2, 4 పాదములు బిందుయుతములు.

అ. బోఁటి యొకతె పెండ్లి పాట పాడఁగఁ జొచ్చె
నాఁకరాని విరహ తాపమునను
బేరుగూర్చి తాను బెండ్లికూతురు గాఁగ
గోత్రధరుఁడు పెండ్లి కొడుకు గాఁగ 311

పై పద్యము ఏ గ్రంథములోనిదో అప్పకవి తెలుపలేదు. తొలి రెండు పాదములందును ప్రాస యతి యున్నది. ప్రాసపూర్వములు బిందుయుతములు-యతిస్థాన పూర్వములు బిందుయుతములు కావు.

ఆదిపర్వమునందు : (2-42)

క. ఆపన్నగ ముఖ్యులఁ దన
వీఁపునఁ బెట్టుకొని పఱచి విపినములు మహా
ద్వీపములు గిరులు సకల ది
శాపాల పురములుఁ జూపె జని వారలకున్ 312

పై పద్యమున 1, 3, 4 పాదములందు ప్రాసపూర్వము బిందు యుతముకాదు. రెండవపాదము బిందుయుతము.

## 4. సంయుతాక్షర ప్రాసము

తే. సంయుతాక్షర ప్రాసమై జగతి వెలయు
గర్గుఁ డర్చించు దైవంబు భర్గుఁ డనఁగఁ
బక్ష్మ లేక్షణ కౌనతి సూక్ష్మమనఁగఁ
జంద్రి వంశ్యుఁడు భోగ దేవేంద్రుఁ డనఁగ 313

4వ పాదమున సంయుక్తాక్షరము ప్రాసతోనున్న మిగిలిన పాదము లందును అట్లే ఉండవలెను. ప్రాసస్థానమున ఏ హల్లులు ఏ క్రమమున యున్నవో అన్ని పాదములందును అట్టే ఉండవలెను. అప్పకవి ప్రాస యతికిగల తేటగీతి పద్యమునుదహరించుచున్నాడు.

పైపద్యమున 2వ పాదమున గర్గ-భర్గ (ప్రాసము రెండు హల్లులతో కూడియున్నది.

3వపాదమున పక్ష్మ-సూక్ష్మ (ప్రాసము హల్లులతోకూడియున్నది)

4వ పాదమున చంద్ర—వేంద్ర (ప్రాసము బిందుపూర్వక సంయుక్తము)

## 5. సంయుతా సంయుత ప్రాసము

తే. 'కలలు తమక్రింద జడ్డలై క్రాలుచ్రాలు
ప్రాసవర్ణంబులై వాని బాసియైనఁ
గూడియైనను బెఱయుదుగులను నిలుచు
సంయుతా సంయుత ప్రాస సంజ్ఞ దనిశి. **314**

ర-ల వర్ణములు క్రిందనున్న సంయుక్తాక్షరము ప్రాసస్థానమున నున్న మిగిలిన పాదములందు ఆ ర-ల వర్ణములు లేకున్నను ప్రాసమైత్రి చెల్లును. ఒకచో ర-ల సంయుతము మరొకచో అసంయుతము నగుట విది సంయుతాసంయుతప్రాసమగుచున్నది.

తే. పాఁడి ద్రచ్చఁగ నిమ్మనా తండ్రి కృష్ణ
వేఁడుకొనియెద నందాఁకఁ బండ్లు దినుము
దుండుగపు చేష్టలును నోటి గాండ్రతనము
మెండగాఁజొచ్చె నీకు నై దేండ్లు కఁనగ **315**

పై పద్యమున 1, 2 పాదములందు (పాఁడి—తండ్రి) (వేఁడు—బండ్లు) ర,ల సంయుతాసంయుతము చూపబడినది-అప్పకవి ప్రాసపూర్వము అర్ధబిందుయుతము, పూర్ణబిందుయుతమునగుచో ప్రాసమైత్రి చెల్లుననుటకే ఈ ఉదాహరణము నిచ్చియుండును.

3, 4 పాదములందు (దండ—గాంధ్ర)ద (మెండు-ఏండ్లు) ర,ల సంయుతా సంయుతము.

రేఫశ్లిష్టమునకు నాదిపర్వమునందు (2-173)

ఉ. క్షత్రియ వంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియ వైశ్యశూద్రులనఁ గాదఁగు నాలుగు జాతులన్ స్వధా
రిత్రముఁ దప్పకుండఁగ బ రిక్షితు కాచినయట్లు గామ మాం
ధాతృ రఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబునన్ 316

వ. మాంధాతృశబ్దము ఋకారాంతము గనుకఁదకారము క్రింద నున్నది వత్రసుడీగాని గ్రారవడీగాదు. 317

పై పద్యమున తొలి మూడు పాదములందును తకారము రేఫతో కూడియున్నది.

నాల్గవ పాదమున ఋ కారముతో కూడియున్నది. కావున ఇది రేఫ సంయుత సంయుత ప్రాసమైనది.

అందునకు కవి కర్ణరసాయనమునందు : (2-58)

సీ. గీ. దాన గుణశాలి భూసము ద్ధరణ దక్షుఁ
డనిశ మఖ దీక్షితుండు మ త్తారి హారిణ
విహృతి నిరతుఁడు యువనాశ్వ విభు సుతుండు
ఘనుఁడు మాంధాత నృపుఁడైన కాలమునను 318

పైపద్యము నాల్గవ పాదమున నున్న మాంధాత ప్రయోగము ఆది ఋకారాంతతత్స మనుమాటకు ఉదాహరణము. విధాతృ-విధాతవలెనే మాంధాతృ-మాంధాత యనునది తత్సమ ప్రథమాంతరూపము. 'మాంధాత్ర' కాదని 'మాంధాతృ' అనిన దేశశబ్దమని స్పష్టము.

సోముని హరి వంశమునందు :

శా. నాతో మార్కొన లేరు నిర్జరపురీ నాగేంద్ర
బృందారకా
రాతుల్మున్నుగ దేవసంఘములు పో రక్ధీర సంగ్రామ
కుం
డీ త్రైలోక్యమునందుఁ గల్గఁడు రణం బెచ్చోట
లేకుండఁగాఁ
జేతుల్ వేయు వృథా భరంబగుచు వచ్చెన్ దేవ
యీమేనికిన్. 319

పై పద్యమున 1, 2, 4 పాదములందు తకారము ప్రాసాక్షరము. మూడవ పాదమున త్రైరేఫ సంయుక్తము. ఇది సంయుతా సంయుత ప్రాసము.

దేవీవిజయమునందు :

తే. వాక్త్రినేత్రాంగనా శచీ శక్తు లధిక
సంభ్రమంబునఁ గుంభ నికుంభ దైత్య
హంత్రిఁ బూజింపుదురు త్రయీ మంత్రములను
స్తోత్రములు చేసి మంగళా రాత్రిక లిడి. 320

పై పద్యము తొలి రెండుపాదములందు వాక్త్రి-శక్తు, సంభ్ర-కుంభలయందు ప్రాసాక్షరములు రేఫ యుతములు. ప్రాసయతి స్థానములు రేఫ రహితములు.

పద్మ పురాణమునందు :

క. శ్రీకర చక్రాంకితులగు
లోకులు శుద్ధులును బుణ్యు లును నగుదురు నా
రీ క్రియలు లేక యుండినఁ
బాకృతులనఁ బతితులనఁగఁ బడుదురు జగతిన్. 321

పై పద్యమున 1, 2, 4 పాదములందు, కకార ప్రాసమున్నది. మూడవ పాదము రేఫ సంయుతము. నాల్గవపాదమున 'ప్రాకృతు'లను శబ్దము ఋకారాంతము. రేఫసంయుతముకాదు

రాఘవ పాండవీయమున (పీఠిక-8)

శా. లోక త్రాణరతిం దదాదిమ మహీ లోక ప్రవేశోత్క భా
షాక్ల ప్త ప్రథమ ద్వితీయపద గుం జన్మంజు మంజీర గ
ర్జా కల్పామలరామ భారత కథా సర్గంబుల న్మించు వా
ల్మీకి వ్యాసులఁ గొల్చెదం దదుభయ శ్లేషార్థ
సంసిద్ధికిన్. 322

పై పద్యమున రెండవ పాదమున క్ల ఌకార స్వర సంయుతము. లకారమని భ్రమింపరాదు.

## 6. రేఫయుత ప్రాసము.

ఆ. నుడులు తెలుఁగులందుఁ బొడమ, వాకై వడి
వ్రాలు కొమ్ము ఱ్ఱార వడులుగాన
రేఫయుత సమాఖ్య గృతులఁ బ్రాసములగు
సారిదిఁ దమకుఁదాము నుడులఁబాసి. 323

తద్భవ, దేశ్య పదములు అచ్చతెనుగు అనబడును. అచ్చతెనుగున వట్రువసుడిలేదు. వట్రువసుడివలె ఉచ్చరింపబడునని ఉ—ఊలతో కూడిన ఱ్ఱారవడులు మాత్రమే. ఱ్ఱారవడులుగల హల్లులనే అన్ని ప్రాసస్థానము అందును గూర్చవలెనుగాని వట్రువసుడులతో ఱ్ఱారవడులను గలిపి ప్రాస స్థానమున నుంచరాదు. అట్లువేసిన అది సంయుతాసంయుత ప్రాసమగునని, దోషము గాదని పూర్వోదాహృతిచే నెరుంగునది.

క. సంగ్రామ రంగమునఁ బెలు
చంగ్రుమ్మరుచున్న సాల్వ జగతీవరు మే
నం గ్రుచ్చిపార నాటిం
చెంగ్రూరాస్త్రములు నాల్గు శ్రీకృష్ణుఁడొగిన్. 324

పై పద్యము నాల్గు పాదములందును ప్రాసస్థానమున రేఫతోకూడిన గకారమే యున్నది.

క. ఈ ఱ్ఱార వలుకునకు మొదల
లై ఱ్ఱాలుచుఁదేలి ప్రాస మగుఁ దనతనకే
శ్రీ ఱ్ఱొమ్ముడి సౌందర్యము
వాఱ్ఱువ్వందరమె యురగ వరునకునైనన్. 325

తెలుగు పదములందు ఱ్ఱారముందు వర్ణము గురువుకాదు. సంయుక్తాక్షరమునకు ముందు వర్ణము గురువగునసుట ఇట చెల్లదు. ఱ్ఱార తేల్చి

పలుకుట దీనికి కారణము. కావున అట్టి క్రారప్రాసమునందున్న పూర్వాక్షరములన్నియు గురువులగునట్లుగనే ప్రయోగింపవలెను. సంయుక్తపూర్వాక్షరమగునను కానరాదు.

పై పద్యమున ప్రాసపూర్వాక్షరములన్నియు గురువులేయగుట గ్రాహ్యము.

## 7. లఘుద్విత్వ ప్రాసము

తే. భువి లఘుద్విత్వసంజ్ఞి కంబులయి కొన్ని
యూఁదబడని క్రారలతోడ నొకటికొకటి
ప్రాసముల కగుఁ దమలోనఁ బత్త్రయుగము
విద్రుచె వినతాత్మజుఁడు దిక్కు లద్రువననఁగ. 326

తెనుగున అద్రుచు, విద్రుచు మున్నగు శబ్దములలో రేఫ సంయుక్తత యున్నను తత్పూర్వ స్వరములు లఘువులేయగుచున్నవి. అట్టి తేల్చి పలుకబడెడు వానికి మరల అట్టివాని తోడనే ప్రాసమునుంచవలెను.

పై పద్యము నాలుగవ పాదమున విద్రుచు-అద్రుచులలో ద్ర ప్రాసలో నున్న సంయుక్తాక్షరము. తేల్చి పలుకబడుటచే పూర్వాక్షరము గురువుకాదు. ఈ లక్ష్యము ప్రాసయతిలో నున్నది.

## 8. వికల్ప ప్రాసము

తే. పంచవర్గంబులను గను పట్టునట్టి
పొల్లు లనునాసికాక్షరంబులను గదిసి
తమదు పంచమములుఁ దృతీయములునగుచు
నమరుఁ బ్రాసంబులకు వికల్పాహ్వయముల. 327

సంస్కృతమున క, చ, ట, త, ప అను అయిదు వర్ణములలోవి పొల్లుహల్లులకు అనునాసికాక్షరములు పరమగునపుడు ఒకచో తమ వర్గ పంచమాక్షరము (అనునాసికము)గను, (ప్రాక్+యతి-ప్రాఙ్మతి) ఒకచో

తమవర్గ తృతీయాక్షరము (ప్రాగ్మతి)గనుమారుచున్నవి. అనునాసికసంబం ధముకల ఈ ఉభయాక్షరములకు ప్రాసముకూర్పవచ్చును. ఇది వికల్పసంధి విషయికమగుటచే ముందు వికల్పయతిని తెల్పి ఇపుడు వికల్ప ప్రాసము వివరించుచున్నాడు.

తే. ప్రాఙ్నగ సమానధృతి సుధా రుఙ్మ్న భాస్య
స్రజ్న్న చయసక్తకంఠ దావాగ్న్ని పాయి
వాఙ్మనోహరనుత యస దృఙ్మహాత్మ
దిఙ్మహితకీర్తి యర్జున యుగ్మభేది. 328

1వ పాదమున ప్రాఙ్నగ—రుఙ్మ్నభాస్య

ఆదేశ అనునాసికములకు సమప్రాస

2వ పాదమున స్రఙ్నచయ-దావాగ్ని

స్రక్+నిచయ-స్రఙ్నచయ, స్రగ్నిచయ వర్గ తృతీయాక్షరము వికల్పముగానున్నది. కావున జకార, గకారములకు అసమప్రాప

3వ పాదమున వాఙ్మనో—దృఙ్మహాత్మ

ఆదేశ అనునాసికములకు సమప్రాస

4వ పాదమున దిఙ్మహిత—యుగ్మ

దిగ్మహితయను వర్గతృతీయాక్షరరూపము కలదు. కావున జకార, గకారములకు అసమప్రాస.

## 9. ఉభయప్రాసము

ఆ. థాత్రిఁ బాణినీయ సూత్రములను దృతీ
యోష్మమును ద్రుతంబు నొక్కచోటఁ

క్రమత షాక్షరము ణ కారమునై ప్రాస
ములకు నుభయసంజ్ఞఁ బొసఁగు రెండు. 329

సకార, నకారములు సంస్కృత వ్యాకరణ సూత్రములచే కొన్ని చోట్ల షకార, ణకారములుగా మారుచున్నవి. ఆ ఆదేశ షకార, ణకారములకు-సహజ షకార, ణకారములతోను,సకార, నకారములతోను ప్రాసమైత్రి చెల్లును. దీనికి ఉభయప్రాసమని పేరు.

తృతీయోష్మము—పకారము.

లక్ష్యములు :

త్రైశంకవోపాఖ్యానమునందు :

క. ఝషకేతు ద్విషునకుఁ గి
ల్బిషవత్వ్రత వృషున కమృత విషనిధి జామా
త్రిషునకు ఋషిపూజితునకు
విషమాత్మున కింద్రముఖ దివిజనుత్యునకున్. 330

4వ పాదమున వి+సమ-విషమ ఆదేశ షకారము 1,2,3 పాదము లందు సహజ షకారము. ఆదేశ షకారమునకు సహజ షకారమునకు ఉభయప్రాస.

సాంబ విలాసమునందు :

క. వసుధా కళత్రునకు సా
రసదళ నేత్రునకు మతుద శాతిమద తమో
విస రాంబుజ మిత్రునకు
న్విషమ శిలీముఖసహస్ర నిభగాత్రునకున్. 331

4వ పాదమునందలి ఆదేశ షకారమునకు, 1, 2, 3పాదమునందలి సకారముతో ప్రాసమైత్రి.

తే. ప్రాణములఁబాపె నాహవ క్షోణియందుఁ
బ్రాణవల్లభఁ గొనిచన్న దానవేంద్రుఁ
దమ్ముఁడును దాను గీశజా తమ్ముతోడ
శరధి బంధించిదాఁటె దా శరధి యనఁగ. 332

ఇది న-ణ ప్రాస విషయికము. ప్ర+అన-ప్రాణ ఆదేశ ణకారము నకు తొలిపాదమున ణకారముతోను, రెండవపాదమున సహజ నకారము తోను, ప్రాసమైత్రి.

ఇతరుల లక్ష్యములు.

ఉద్యోగ పర్వమునందు : (1-299)

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణ శల్యులున్
బ్రాణము లాసు యోధనుని పాలివయంద్రు నిజానుజన్ముల
క్షీణ పరాక్రము ల్సుతుల జేయులు బాహ్లిక సోమ దత్తులా
స్థాణునకైనోడరు వ శంబె జయింపఁగ వారి నేరికిన్ 333

రెండవ పాదమునందలి ప్రాణలోని ఆదేశ ణకారమునకు మిగిలిన మూడు పాదములలోని సహజ నకారముతో ప్రాసమైత్రి.

కాళహస్తి మాహాత్మ్యమునందు : (1-109)

మ. ప్రణతుల్సేయుచుఁ గాంచెఁ గుంభజుఁడులోపాముద్రతోఁ గూడి త
త్క్షిణకైలాసము యంబికాహార కృత శ్రీపాద కాన్యాసమున్

మణిమంత్రౌషధవాసమున్ భవమహామాయావిపర్యాస
మున్
గణనాతీత నటీవిలాసము సమగ్రశ్రీసముల్లాసమున్ 334

తొలిపాదములోని ప్ర+నతులు–ప్రణతులు ఆదేశ ణకారమునకు, మిగిలిన మూడుపాదములలోని సహజ ణకారమునకు ప్రాసమైత్రి.

కాశీఖండమునందు : (2-150)

క. త్రిణయనుని రాణివాసము
నణిమాద్యైశ్వర్య వితర ణాచురతరువున్
మణికర్ణిక ముక్తి వధూ
మణికర్ణికఁ దలఁచె మౌని మానసవీథిన్ 335

తొలి పాదమునందలి త్రి+నయన-త్రిణయన ఆదేశ ణకారమునకు మిగిలిన పాదములందలి సహజ ణకారముతో ప్రాసమైత్రి.

రామాయణమునందు : (6-554)

చ. రణమున నుగ్రసాయక పరంపర భానుకులం బరామల
క్ష్మణము జగంబవానరము గా విలునేర్చును మద్భుజా
విజృం
భణమునుజూపి తండ్రి మదిఁ బుట్టినచింత దొలంగఁ బెట్టి
శూ
ర్పణఖకు నిట్లు వాటిలిన బన్నము నీఁగుదు నేనవశ్య
మున్. 336

నాలుగవ పాదమున శూర్ప+నఖ–శూర్పణఖ ఆదేశ ణకారమునకు, మిగిలిన సహజ ణకారములతో ప్రాసమైత్రి.

మధుసేవనమునందు :

క. హోను ద్యోగముఁ జేసిన
ప్రాణంబా యింక నీకుఁ బాథేయం బీ
మానిని మందస్మిత మధు
రానన చంద్రికలు గ్రోలి యరుగుము పిదపన్. 337

రెండవ పాదము నందలి ప్ర+అన-ప్రాణ ఆదేశ ణకారమునకు మిగిలిన సహజ నకారములతో ప్రాస మైత్రి.

శృంగార షష్ఠమునందు :

క. అనుటయుఁ గృష్ణ ద్వైపా
యన తనయుం డిట్టులనియె నవహిత మతియై
వినుమతి గుహ్యము నారా
యణ కవచము భక్త వాంఛితార్థ ప్రదమున్.

నాలుగవ పాదమున నార+అయన—నారాయణ ఆదేశ ణ కారమునకు, మిగిలిన సహజ న కారముతో ప్రాసమైత్రి.

అరణ్యపర్వమందు : (4-38)

కనకగిరిం బ్రదక్షిణము గా శశిభాస్కర తారకాగణం
బనవరతంబు ద్రిమ్మరు మహాముని సప్తక మండలంబుతో
ననఘు తదీయశైల శిఖ రాగ్రమునందుఁ బయోరుహాసన
త్రిణయన విష్ణులుందుదురు దేవగణంబులు గొల్చు
చుండఁగన్. 339

నాలుగవ పాదమునందలి త్రి+నయన-త్రిణయన ఆదేశ ణ కారమునకు, సహజ న కారములతో ప్రాసమైత్రి.

## 10. అనునాసికప్రాసము

తే. తమకుఁదాము ద్విత్వంబులై తనరునవియుఁ
బూర్ణ బిందులు డాపలఁ బొరయునవియుఁ
గలసి యనునాసిక ప్రాసములను పేర
న మ లమరుఁ గావ్యములందుఁ దమకుఁదాము. 340

ద్విత్వయుక్తములైన న కార, మ కారములకు క్రమముగా పూర్ణ బిందు పూర్వకములైన న కార, మ కారములతో ప్రాస చెల్లును.

క. మిన్నేఱు పాదమున ధా
తంనాభిని గుసుమశరు నెదం గాంచిన నీ
సాన్నిధ్యము దొరకుటకై
సన్నుతి సేయుదురు నిన్ను సనకాదులజా. 341

రెండవ పాదమునందలి పూర్వబిందు పూర్వక న కారమునకు, మిగిలిన పాదములందలి ద్విత్వ న కారముతో ప్రాస మైత్రి.

క. తమ్ములను మల్లికా కుసు
మమ్ముల మరువాది పత్ర మాలికలను భ
క్తిం మురసంహారు పూజలు
సమ్మదమున సలుపఁగలుగు సకలార్థంబుల్. 342

మూడవ పాదము నందలి పూర్ణబిందు పూర్వక మ కారమునకు, మిగిలిన పాదములందలి ద్విత్వ మ కారమునకు ప్రాసమైత్రి.

## 11. ప్రాసమైత్రి ప్రాసము

తే. గట్టిబిందువు మీఁది బ కారమునకు
జమిలి మా ప్రాసమైత్రి నా జరుగుచుండుఁ

గమ్మతావులు వెదచల్లు నంబుజములు
శంబరారాతిచేతి వాలమ్ము లనఁగ. 343

గట్టి బిందువు-పూర్ణబిందువు. జిఱుబిమా-ద్విత్వ మ కారము.

పూర్ణబిందు పూర్వక బ కారమునకు (ంబ) ద్విత్వ మ కారమునకు ప్రాస చెల్లును.

3 వ పాదమున కమ్మ—అంబు

4 వ పాదమున శంబ—వాలమ్మ

## 12 ప్రాస వైరము

తే. శబ్దముల రేఫమునకు ఱ కారమునకు
మైత్రి గలుగమిఁ గవి శిఖా మణులు ప్రాస
వైర మనుచును గలవరు వానినెందుఁ
గూర్తు రా రెండు నెఱుఁగక కుకవిజనులు. 344

సాదురేఫ (ర) శకటరేఫ (ఱ)లకు ప్రాసమైత్రికాదు. కవిశ్రేష్ఠులు ప్రాసవైరమని తలంచి ఆ రెంటికిని ప్రాసవేయరు. ఆ రెంటి భేదము నెఱుంగని కుకవిజనులు ర—ఱలకు ప్రాసవేయుదురు.

ఏకతర యతియందు ర—ఱలకు యతిమైత్రి నిషేధింపబడినది. ఇందు ప్రాసమైత్రి నిషేధింపబడినది. దీనివిబట్టి అప్పకవి మతమున ర-ఱలకు యతిప్రాసములు రెండును చెల్లవు.

## 13 సవర్గజ ప్రాస.

తే. గ్రంథమంథ శబ్దంబుల గల ద్వితీయ
వర్ణములు రెండును సఘోష వర్ణములగు

నైన నిజవర్గభవ చతుర్థాక్షరములఁ
గలియుఁ బ్రాసంబులను స్వవర్గజము లనంగ. 345

గ్రంథ, మంథ శబ్దములలోని రెండవ అక్షరము (థ) అఘోష ప్రయత్న వర్ణము. అయినను మహాకవులు స్వవర్గములోని చతుర్థాక్షరము (ధ)తో ప్రాసమైత్రి కూర్చి యుండిరి. కావున థ-ధలకు ప్రాస చెల్లును. దీనిని స్వవర్గజ ప్రాసమందురు.

వ. 'శ్రంథగ్రంథ సందర్భే' యను ధాతువులవల్లను 'శాస్త్రద్రవిణ యోర్గ్రంథః' అని నామలింగానుశాసనము నందు నానార్థవర్గములోపలను దవర్గద్వితీయాంతములయందే అమర సింహుడు చెప్పుటచేతను గ్రంథిశబ్దము తనయందు రెండవ వ్రాయితవర్ణమునందు ద్వితీయాక్షరమైనఁగానీ ప్రాసములయందుఁ జతుర్థాక్షరములకు మహాకవి ప్రయోగములు గలుగుటవల్లను జెల్లును. 346

గ్రంథ శబ్దములోని రెండవ అక్షరము తకారాంత ధాతువులలో చెప్పబడుట చేతను, అమరసింహుడు నామలింగానుశాసనమున గ్రంథ శబ్దమును థకారాంతములతో చెప్పుట చేతను ఈ థకారము రూఢము. దీనికి వర్గచతుర్థాక్షరము ధకారముతో ప్రాసమైత్రి మహాకవి ప్రయోగములవలన చెల్లును.

ఆరణ్య పర్వమునందు : (4-160)

ఉ. అంధక వృష్ణిభోజ కురు రాన్వయ భూపతులెల్ల నీదెసన్
బాంధవ సౌహృద ప్రణయ భక్తి విశేషములొప్ప నీ

గ్రంథియడంగఁజేయు నెసకంబునఁ బూనినవారు
లోభమో
హాంధులు ధార్తరాష్ట్రిలు నయమ్ము మెయి న్మన కుర్వి
యిత్తురే. 347

పై పద్యమున మూడవపాదమున గ్రంధి థకారమున్నది. 1 2 4 పాదములందు ప్రాసలో ధకారమున్నది. కావున ధ, థలకు ప్రాసమైత్రి కూర్పబడినది.

విరాట పర్వమునందు: (1-333)

ఉ. బాంధవ శాత్రవాకలిత భావభవా భవపాశబంధ సం
 భంథ విరామకామ హరి పక్వవివేక నిరూఢ భక్తహృ
 ద్గ్రింథి విభేదనా పరమ కారుణికా పరిమాణదూర దురి
 తేంధన పావకాయిత నవీక్షణ చైత్యమహోద్భ
తాత్మకా. 348

పై పద్యమున 3వపాదమున గ్రంధిలోని థకారమునకు, 1, 2, 4 పాదములలోని ధకారమునకు ప్రాసమైత్రి చేయబడినది.

వ. మంథ విలోడనే యను ధాతువు కవికల్ప ద్రుమము నందుఁ దవర్గద్వితీయాంతధాతువులలోను జరిగణమైనదిగనుక మంథరశబ్దములోని రెండవ వ్రాయి తవర్గమునందు ద్వితీయాక్షరమైనను బ్రాసములపట్లను బూర్వకవిప్రయోగములు గలుగుట చేతనే చతుర్థ వర్ణములకుఁ జెప్పవచ్చును. 349

మంథర శబ్దము ధాతుపాఠము చేతను, కవికల్ప ద్రుమములోను ధకారాంతముగనే కనబడుచున్నది. ఈ థకారమునకు ధకారముతో ప్రాస చెల్లుట పూర్వకవి ప్రయోగములలో కనబడుచున్నది. కావున అట్లు ప్రాస వేయవచ్చును.

ద్రోణ పర్వమునందు : (1-88)

క. సింధురము మదోద్రేక మ
దాంధంబై వచ్చు నోజ నాచార్యునిపై
గంధవహ సుతుఁడు గవయుఁగ
మంధరగతి నెవ్వఁడాఁగు మన యోధులలోన్. 350

నాల్గవ పాదమున మంధర శబ్దమునకు, థకారమునకు, మిగిలిన పాదములలో నున్న ధకారమునకు ప్రాసమైత్రి.

ఆముక్త మాల్యదయందు : (5-158)

ఉ. కంధర నీలవర్ణ మధు కైటభనాగసుపర్ణ యోగి హృ
ద్గ్రంథిభిదోత్థభోగి వని తాన్వన వచ్ఛ్వసనస్రవచ్ఛిర
స్సంధివసన్నిశావతి ర సస్రుతి దుగ్ధపయోధి వీచికా
మంథర కేళికాధర సమాశ్రితపంక్తి శిరోధిసోదరా.

1, 3 పాదములందున్న ధకారమునకు 2, 4 పాదములందున్న థకారమునకు ప్రాసమైత్రి.

వ. బుధ అవగమనే అను ధాతువు వలనను బుధశబ్దము లోని రెండవ ద్రావాయి తవర్గమునందుఁ జతుర్థాక్షరమైనను ప్రాసములవట్లను బూర్వకవిప్రయోగములు కలుగుటచేతను దృతీయ వర్ణములకుఁ జెప్పవచ్చును. సుధాశబ్దము మొదలైన వానికిని నిటువలెనేయని తెలిసికొనునది. 352

బుధ, సుధ శబ్దములందు ధకారమున్నది. ఈ ధకారమునకు దకారముతో పూర్వకవుల ప్రయోగములలో ప్రాసమైత్రి కనబడుచున్నది. కావున ద,ధలకు ప్రాసమైత్రి చెప్పవచ్చును.

ఆదిపర్వమునందు :

ఉ. సాధన కోటిపాటి యుప కారము తక్షకుఁడేక విప్రసం
బోధనఁ జేసి చేసె నృప పుంగవ నీవు ననేక భూసురా
పాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికా
కోదర సంహతిన్ హుతవహోగ్ర మహోగ్ర శిఖాచయం
బులన్.　353

2వపాదమున ధకారము, 1, 3, 4 పాదములలో దకారము కలదు.

ద, ధలకు ప్రాసమైత్రి.

నరసింహ పురాణమునందు :

క. వేదము లాదిగఁగల య
ష్టాదశ విద్యలకు నీవ స్రష్టవు తత్త
ద్బోధకులును భవదాజ్ఞా
పాదకులు సమస్త ధర్మ పాలనచతురా.　354

3వ పాదములో ధకారము, 1, 2, 4 పాదములలో దకారము.

ద, ధలకు ప్రాసమైత్రి.

విరాట పర్వమునందు :

క. ముద మొదవ రమ్యహర్మ్యము
తుది నిలువున నిష్టసఖుల తోడ విహారా
స్పదమగు నెలవున మెలఁగెడు
సుధేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్.　355

4వ పాదమునందలి ధకారమునకు 1, 2, 3 పాదములందలి దకారమునకు ప్రాసమైత్రి.

ద్రోణ పర్వమునందు : (1-135)

క. వింధ్యాద్రివోలె నాత్రవతి
 వింధ్యుఁడచలితోగ్ర మూర్తి వెలయ నిలిచి గ
 ర్వాంధత్వ మలరఁగను దీప్తా
 వంధ్యాస్త్రము లక్కుమార వరుపైఁబఱపెన్. 356

1, 3, 4పాదములలో ధ్య, 2వపాదములో ద్య కలదు. దధలకు ప్రాసమైత్రి.

విరాట పర్వమునందు ; (1-135)

ఉ. ఎండకు వానకోర్చి తన యిల్లు ప్రవాసపుఁ జోటునాక
యా
 కొంటి నలంగితి న్నిదుర కుందితి దప్పను దప్పివుట్టె నొ
 క్కండను నెట్లొకో యనక కార్యముగల్గిన వేళ నేలినా
 తండొకచాయఁ జూపినను దత్పరతం బనిసేయు
 టొప్పగున్. 357

2వ పాదమున టకారమునకు, 1, 3, 4 పాదములందలి డకార మునకు ప్రాసమైత్రి.

ఇందొక విశేషమును గమనింపవలెను. ద,ధలకు ప్రాసమైత్రి నంగీకరించిన అప్పకవి ట,డలకు ప్రాసమైత్రి కల పద్యము నుదహరించుట ద్వారా ట,డల ప్రాసమైత్రి నంగీకరించెననవలెను. అపుడు ఇదియు స్వవర్గజ ప్రాసమగును.

## 14 ఋప్రాసము

తే. స్వరములెల్లను బ్రకృతి భావంబులందు
 రా వెనుకవ్రాయి యగు ఋస్వరంబొకండు

తగు యణాదేశమున రేఫ మగుటఁజేసి
ప్రాసముల కట్లయగు వళి పట్లగాదు. 358

ప్రకృతి భావమన సంధిరాక ఉన్నది ఉన్నట్లుండి పోవుటయని, రావెనుక ప్రాయియన 'య'కారమని గ్రహించునది. స్వరములకన్నిటికిని సంధిరాని చోటుల యడాగమము వచ్చుచున్నది. 'ఋ'కారము యణా దేశమున రేఫమగుచున్నది. కావున 'ఋ'కారమునకు రేఫముతో ప్రాసమైత్రి చేయవచ్చును. అటులని 'ఋ-ర',లకు యతి చెల్లదు.

ఋవడిచే ఋకారమునకు 'రిరీరెరే'లతో యతి చెల్లును. యతికి స్వరమైత్రి అవసరము. ప్రాసమునకు వ్యంజనమైత్రి చాలును, స్వరమైత్రి ఉండనక్కఱలేదు.

క. ధారుణి ఋప్రాసమునం
గా రేఫాక్షరమునకు ఋ కారము చెల్లున్
నారికెనై నాకకుజం
బాఋభుపతి గెలిచి తెచ్చె నచ్యుతుఁడనఁగన్. 359

4వపాదమున ఋకారము, 1,2,3 పాదములలో రేఫము కలదు. 'ఋ-ర'లకు ప్రాసమైత్రి. స్వరమైత్రి పాటింపబడకపోవుట గ్రహించునది ప్రాసమున స్వరమైత్రి పాటింపబనిలేదు.

అరణ్యపర్వమునందు : (3-104)
క. ఆ ఋషిపుత్త్రుఁడు గట్టిన
చీరలు మృదులములు నవ్య శిష్టములు మనో
హారులు నాతని పృథుకటి
భారంబున నొక్క కనక పట్టము ప్రేలున్. 360

1వ పాదమున ఋకారము, 2,3,4 పాదములలో రేఫము. 'ఋ-ర' లకు ప్రాసమైత్రి.

## 15 లఘుయకారప్రాసము.

తే. ప్రకృతి భావంబుఁ జెందిన ప్రాణములకు
మొదలి యంత్యస్థములు ప్రాసములను నిలుచు
నటమటలు లేక లఘు యకారాహ్వయములం
నా<u>య</u>జునితండ్రి ఫణిరాజ శాయి <u>య</u>నఁగ. 361

లఘ్వలఘు భేదమున యకారము రెండు విధములగుచున్నది. సహజముగ శబ్దము నందున్న యకారము అలఘువు. సంధి కానిచోట వచ్చు ఆగమ యకారము లఘువు. ఈ రెండు యకారములకును ప్రాస మైత్రి చెల్లును.

లఘుయకారముకూడ ప్రాసమున సిద్ధ యకారము వంటిదే అని తెలుపుటకు దీనిని లఘుయకార ప్రాసమని అప్పకవి తెలిపెను.

4వపాదమున 'అ<u>య</u>జుని' అనుచో ప్రాస యకారము లఘువు.

శాయిలోని యతిలో నున్న యకారము అలఘువు.

ఆగమయకారమునకు సహజ, యకారమునకు ప్రాసయతి.

కళాపూర్ణోదయమునందు : (1-92)

ఉ. ఏ<u>రు</u>పెఁడ నెన్నఁడుగనని యింపులుగులెక్కఁడు తద్గళస్వనం
బాయతమైన కౌతుకము నద్భుతము న్మొలపింపనెయ్యడ
ద్దియిది చాలఁగ్రొత్తబళి యింకొకమాటిఁక నొక్క
మాటటం
చాయ్యలి సీలవేణి నల కాధిపసూనుఁడు వేఁడ వేడినన్
362

1, 3, 4 పాదములందలి ప్రాస యకారము లఘువు. 2వ పాదమునందలి యకారము లఘువు. లఘు, అలఘు యకారములకు ప్రాస మైత్రి.

## 16. అభేద ప్రాసము

గీ. రేఫమునకుఁ బైనుండు మాతృకకుఁ బెద్ద
లాయభేదాహ్వయ ప్రాస మై యెసంగు
ఖలజన విపక్ష జలరుహా దళనిభాక్ష
కాళి తోరఁగ మదవన కేలి యనఁగ 363

రేఫమునకు పై నుండు మాతృక లకారము, పెద్ద లా-ళకారము. లకారమునకు, ళకారమునకు పరస్పరము ప్రాసమైత్రి చెల్లును. ఇది అభేద ప్రాస. గీత పద్యమున ఉత్తరార్ధము లక్ష్యము

3వ పాదమున ఖ ల—ద ళ, 4వ పాదమున కాళి—కే లి

రాజశేఖరుని చరిత్రమునందు : (2-4)

శా. కేళీ కాంచన సౌధవీధికల చక్కన్ దొట్లలోఁ బెట్టి యో
హాలేయాచల కన్యకాధవ కృపా పారంగతా నిద్ర వో
వేలావణ్య పయోనిధీ యనుచు నావిర్భూత మోదంబుతో
జోలల్పాడుదు రక్కుమారకునకున్ శుద్ధాంతకాంతా
మణుల్ 364

1వ పాదమున ళ కారము, 2, 3, 4 పాదములందు లకారము. ల, ళ ప్రాసమైత్రి.

రామాభ్యుదయమునందు ? (1-8)

ఉ. పాలును నీరు నేఱుపఱు పంగల మానవుల వేదవీధి వా
హ్యాళి యొనర్చ్చ నేయలికు లాలక తాసితవర్ణ
యయ్యు నే

బాల సువర్ణ దేహమున భాసిలు నాసలు మోము వేల్పు ప్రో
యాలు ప్రవీణ మామక మహాకృతినాథుఁ గృతార్థుఁ జేయుతన్ 365

2వ పాదమున ళ కారము, 1, 3, 4 పాదములందు లకారము. ల, ళ లకు ప్రాసమైత్రి.

తే. పెద్దలాకును దనకు న భేదమగుట
లళలకు నభేద మట్లన గలుగు కతన
క్షితిని మూఁడవ సతళంబు యతులఁ బ్రాస
ములను రఘువ్వలఘుల కార ములకు నిలుచు 366

ళ కారమునకు డ కారమునకు అభేదమగుటచేతను, అట్లే లకార మునకు ళ కారముకు అభేద మగుటచేతను డ కారము—లళ లకు అభేద ప్రాపమగుచున్నది. కావున ల, ళ, డ మూడును పరస్పరము యతి ప్రాసములందు ఒకదాని కొకటి చెల్లును.

ప్రభావతీ ప్రద్యుమ్నమునందు: (1-57)

ఉ. జలనిధి యను తెర మఱుఁగటు
వెడలి నిలిచినట్టి యాట వెలఁదియ పోలెన్
గడు నింపులు గులుకుచు దన
రెండు నీ పురలక్ష్మి యవధరించే తె యధిపా 367

1వ పాదమున లకారము, 2, 3, 4 పాదములందు డ కారము- ల, డ ప్రాసమైత్రి.

ఉద్యోగపర్వమునందు (1-220)

క. కొడుకులు దానును గుఱ్ఱపు
దళములు కరిఘటలు భటర థ్ర వాతములున్

బుడమి చలింపఁగ ద్రుపదుఁడు
గడువేఁడుకఁదోఁడు సూపెఁ గౌంతేయులకున్ 368

2వ పాదమున ళ కారము, 1, 3, 4 పాదములందు డ కారము
ళ, డ లకు ప్రాసమైత్రి.

భీష్మపర్వమునందు : (1-93)

క. కొండు కులు దమ్ములు గుఱ్ఱపు
దళములు పైకైకొన బలవితానము తగుమై
నడపింపుచు మెలపున సం
గడములతో నడచు శకుని కడు నొప్పారెన్ 369

2వ పాదమున ళ కారము, 1, 3, 4 పాదములందు డ కారము
ళ, డ ప్రాసమైత్రి.

శృంగార నైషధమునందు : (4-24)

చ. చిలుకలు గాయునో చెవులు సిల్లులుగాఁ వఁగ నంచు
నెన్నఁడున్
వెడలఁడు నందనోపవన వీథులకై యట మౌళిభాగన
ర్మిళ శశిరేఖ చేయు నపరాధమునన్ గజదైత్యశాసనుం
గొలువఁడు పాకశాసనుఁడు కోమలి నీదెసఁ గూర్మి
యెట్టిదో 370

2వ పాదమున డ కారము, 1, 3, 4 పాదములందు ల కారము
ల డ లకు ప్రాసమైత్రి.

కూర్మ పురాణమునందు :

తోటకము. తాలిమి దూలిన తాపసపత్నుల్
పీడ మనంబున వీడ్కొని జాలిన్

లోల మదాలస లోచన పంక్తిన్
జాలఁ దలిర్చిరి శంకరు లీలన్ 371

2వ పాదమున ద కారము, 1, 3, 4 పాదములందు లకారము. ల, ద లకు ప్రాసమైత్రి.

## 17. సంధిగత ప్రాసము

తే. సంధిఁగూడినవ్రాలు ప్రాసంబులైన
నవియె సంధిగతాఖ్యల నమరుచుండు
దివిజు లాశ్చర్య మొంద శౌరిపడవైచె
జెంగిపోనీక మధురలో నంగరినన 372

ప్రాసమునకు వ్యంజనము ప్రధానము. సంధి వశమున-ఉన్న హల్లు నకు బదులు ఆదేశములుగ వచ్చిన హల్లు ప్రాసమున మిత్రత్వము కల దగుచున్నది.

సంధి వలన కలిగిన వర్ణముతో ప్రాస కూర్పబడుచున్నది కాన సంగధిత ప్రాసమైనది. యతి యందువలె గూఢ స్వర వ్యంజనములకు ప్రాస కూర్పరాదని గ్రహించవలెను.

పద్యమున ఉత్తరార్థము లక్ష్యము:

3 వ పాదము దివిజు – శౌరివడ (శౌరి + పడ)

4 వ పాదము జెంగిపో - లోనంగరి (లోనన్+కరి)

శల్యపర్వమునందు : (2–334)

క. కవదొనలును గాండీవము
నవలనిడం బనుపు మింద రరదము డిగు మే
నవి దవ డిగియెద శుభకర
మవు నివ్విధమిట్లు సేయు మనుడు నతండున్ 373

3వ పాదమున (ఏను+పిదప) సంధిగత ఆదేశ వకారమునకు 1, 2, 4 పాదములందు సహజ వకారములకు ప్రాసమైత్రి.

శృంగార శాకుంతలము : (2-187)

శా. ఆవాలుంగనుదోయి యానగు మొగం బాగుబ్బ
పాలిండ్ల పెం
పావేణీభర మాతనూవిలసనం బాయొప్పు లేఁజెప్పనం
గావారంబగుఁగాక కేవలశిరః కంపంబు గల్పించి యా
హావుట్టింపదె యిత్తుధన్యునకు న య్యబ్జాక్షి
నీక్షించినన్ 374

4వ పాదమున (ఆహా+పుట్టింపదే) సంధిగత ఆదేశ వకారమునకు, 1, 2, 3 పాదములందలి సహజ వకారమునకు ప్రాసమైత్రి.

విరాటపర్వమునందు : (4-96)

శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటు
మైనుండి యా
తంగస్ఫూర్జిత యూథదర్శనసము ద్యల్లోభ
మైవచ్చునో
జంగాంతార నివాసఖిన్నమతి నన్మత్తేన్నపై పేఁడ వ
చ్చెంగుంతీసుత మధ్యముండు సమర స్థేమాభి
రామాకృతిన్ 375

1, 2 పాదములందు సహజ గకారము, 3, 4 పాదములందు సంధిగత గకారములకు ప్రాసమైత్రి.

లకార ప్రాసము :

కాకుత్స్థ విజయమునందు :

శా. మారుం డద్భుత శంఖమొక్కటిని సంపాదించి దోర్నైపుణ్య క
స్తూరీ చర్చనపంబునం దనదు కే ల్దోపక్ సువర్ణత్వ రే
ఖాలిప్సన్ శశి కత్తిఁజూప నతడు త్కంఠోత్థుఁడై చేరనిం
పారన్ బట్టుట దోఁచెఁదద్గళము కే శోఘంబు మోముంగనన్ 376

వ. ఈ పద్యములోను 'రేఖాలిప్స' ననుచోట రభ
రాభస్యేయను ధాతువువలనఁ బుట్టినది లిప్సాశబ్దము గనుక
సంధిగత ప్రాసమాయెను. 377

పై పద్యముతో 3వ పాదమున లిప్సాశబ్దము రభధాతువునుండి
పుట్టినది. రభలోని రకారము లకారమైనది. ఆ 'ల'కారమునకు, మిగిలిన
పాదములలోని 'ర'కారముతో ప్రాస కూర్చబడినది. సహజ రేఫకు,
సంధిగత రేఫా దేశ లకారమునకు ప్రాస చూపబడినది.

## అప్రశస్త ప్రాసము

ఆ. అప్రశస్తములగు ప్రాసజాలము లలం
కార విస్మితములు గావుగానఁ
దివిరి ధూర్తులైన కవులు కల్పనఁజేసి
యొప్పిదంబు లనుచుఁ జెప్పరాదు 378

తెలుగు పద్యమునకున్న సహజ రామణీయకత ప్రాసము (యతి యును), అది లక్షణయుక్తమగుచో మరింత శోభాయమానమై ప్రశస్త మగును. మహాకవి ప్రయుక్తములుగావి యట్టివి. లాక్షణికులంగీకరింపనివి అప్రశస్తములు. కుకవుల అప్రశస్తప్రాసములు ప్రామాణికములుకావు. అవి ఒప్పులని చెప్పరాదు.

వీధినాటకమునందు :

ఉ. కందుకకేళి సల్పెదు ప్రకారమునం బురుషాయితక్రియా
తాండవకేళి సల్పెదు విధంబునఁ బాపరభామలేఁతసీ
రెండఁ బ్రభాతవేళ రచియించెను గుబ్బలమీఁది హారముల్
కుండలము లుక్కరు ల్గదల గోమయపిండము లింటి ముందటన్ 379

1వ పాదమున ద కారము, 2, 3, 4 పాదములందు డ కారము కలదు. ద, డ ప్రాస అప్రశస్తము.

రామాయణమునందు : (6-2356)

చ, కదుకొని వేఁడిబాష్పములు గ్రమ్మి పయింబడి పర్వ భీతిమై
నడరుచు విన్ననైన హృదయంబునఁ బొల్పగు హారయష్టి ప

య్యద దడియంగఁ గానఁబడి యంచితనిర్మల రత్న
భూషలన్
దద్దుదిత దృశ్యమానమణి ధామసముజ్జ్వలభాతి
దోఁచఁగన్ 380

1, 2 పాదములందు ఢ కారము, 3, 4 పాదములందు దకారము కలదు. ఢ, ద ప్రాస అప్రశస్తము.

ఇవి 17 వ ప్రధాన ప్రాసములు.

ఇంక శబ్దాలంకారంబులగు విశేష ప్రాసంబు లెఱింగించెద :

## శబ్దాలంకార ప్రాసములు

సీ. ప్రాసంబు సులభాక్ష రంబైన సుకరంబు
దుర్లభంబైనను దుష్కరంబు
తగ రెండు మూఁడు నాలుగు వర్ణముల పదం
బులనెల్ల నొకభంగిఁ బొసంగెనేని
వరుసఁగావ్యముల ద్వంద్వప్రాసమును ద్ర్యక్షీ
రప్రాసమును జతుః ప్రాసమునగుఁ,
బదములఁ దుదినొక్క వగిది యక్షరములు
దనరు నంత్యప్రాసమునకు నెందు,

తే. బడిబడిని వర్ణ మొక్కఁడు కడకు వెడలఁ
బలుకఁబడునేని యది యను ప్రాసమయ్యెఁ
గంజలోచన యివి యలంకార శాస్త్ర
కథితములు వీని నేడింటిఁ గానవలయు 381

నియతమగు ప్రాసమును గూర్చి తెల్పిన యనంతరము అప్పకవి అలంకార ప్రాయమును, ఐచ్ఛికమును అగు శబ్దాలంకార ప్రాసములను గూర్చి వివరించుచున్నాడు. అలంకార శాస్త్రమున ఒక్క అనుప్రాస మాత్రమే చెప్పబడినది. మిగిలినవి ఛందో సంబంధములు. అప్పకవి 7 శబ్దాలంకార ప్రాసములను చెప్పెను.

అవి 1 సుకర ప్రాసము, 2దుష్కర ప్రాసము, 3 ద్వంద్వప్రాసము 4. త్ర్యక్షర ప్రాసము, 5 చతుష్ప్రాసము, 6 అంత్యప్రాసము, 7 అను ప్రాసము.

ఇందు అంత్యానుప్రాసమునమాత్రమే వ్యంజనములను, వానిమీది స్వరములను సామ్యమావశ్యకము మిగిలిన వాటిలో స్వరసామ్యము ఐచ్ఛికము.

## 1. సుకర ప్రాసము

సులభమైన అక్షరములతో కూడిన ప్రాసము సుకరప్రాసము. ప్రాసము ప్రయత్నపూర్వకముగ గాక అనాయాసముగ ఘటింపబడ వలెను.

క. కమలదళ నయన సకలా
గమవేద్య పురాణపురుష కరుణాకర మ
ద్రమహీశ ప్రియతనయా
రమణ యనుచుఁబలుక సుఖ కరప్రాసమగుఁ 382

ఇందు సుకరమగు మవర్ణము ప్రాసతోనుండుటచే సుకరప్రాసము.

## 2. దుష్కర ప్రాసము

సుకరముగాకాక ప్రయత్నపూర్వకముగ సంయుక్తము, ద్విత్వము ఇత్యాదులతోడి ప్రాసము దుష్కరప్రాసము.

క; దుష్కృత గిరివజ్రాయుధ
పుష్కరసదనాధినాథ బుధనుత దవశో
చిష్కేశాహార యనన్
దుష్కరమని దీనిఁ బలుకుదురు ప్రాసజ్ఞుల్ 383

ఇందు దుష్కరమగు సంయుక్తాక్షరము 'ష్క' ప్రాసాక్షరముగ నుండుటచే ఇదిదుష్కర ప్రాసము.

## 3. ద్వంద్వ ప్రాసము

ప్రాసాక్షరమును దాని తరువాతి అక్షరమును అనగా పాదము నందలి రెండు, మూడు అక్షరములు నాల్గు పాదములందును సరిబిగా నుండవలెను. దీనిని ద్వంద్వ ప్రాసము లేదా ద్విప్రాసము అందురు.

క. వ్యాసముని వినుత గోప
స్త్రీ సము దయ మానహరణ శృంగార రసా
వ్యాసముగ నిట్లు ద్వంద్వ
ప్రాసము కావ్యములఁజెప్పఁ బడు నెల్లెడలన్ 384

ఇందు నాల్గు పాదములందును 2- 3 అక్షరములు 'సము' సమముగా నుండునట్లు ప్రాస కూర్చబడినది.

## 4. త్ర్యక్షర ప్రాసము

ప్రతి పాదమునందును 2, 3, 4 అక్షరములు సమముగా నున్న దానిని త్ర్యక్షర ప్రాసమందురు దీనికే త్రిప్రాసమని పేరు.

క. తిరమగుఁ త్రిప్రాసము సుం
దరమగు మురవైరి రూపు తరుణులకు మనో
హరమగు దానవులకు భీ
కరమగుఁ దపసులకు ముక్తి కరమగు ననినన్ 385

ప్రతి పాదమునందును సమముగా 2, 3, 4 అక్షరములు (రమగు) ప్రాసముగా కూర్చబడినది.

## 5. చతుష్ప్రాసము

ప్రతి పాదమునందును 2, 3, 4, 5 అక్షరములు సమముగా కూర్చబడిన అది చతుష్ప్రాసము.

క. ధీరుఁడు కమనీయశుభా
 కారుఁడు కమలావధూటికా మృదుహృదయా
 ధారుఁడు కుమతిజనాధిక
 దూరుఁడు కమలాత్ముఁడనఁ జతుష్ప్రాసమజా 386

ఇందు నాల్గు పాదములందును 2, 3, 4, 5 అక్షరములు (ర ఢ క మ) సమముగా కూర్చబడినవి.

## 6. అంత్యప్రాసము

అన్ని పాదములందును చివరి అక్షరములు ప్రాసాక్షర నియమముతో సమానముగా నున్న అది అంత్య ప్రాసము.

క. తొలుతను గురులఘువులలో
 వలనెయ్యది పదము తుదిని ప్రాసమునకు డా
 పలనిల్చు నదియె నాల్గడు
 గులకడఁ ప్రాసముల మొదలఁ గూర్పఁగవలయున్. 387

అంత్యప్రాస పూర్వాక్షర నియమము చెప్పబడుచున్నది. అంత్య ప్రాస పూర్వాక్షరము గురువుకాని, లఘువుకాని ఏదో ఒక్కటే అయి ఉండ

వలెను. తొలిపాదము చివర గురు, లఘువులలో ఏది ప్రాసమునకు పూర్వం నిలుచునో అదియే నాల్గు పాదములందును ప్రాసపూర్వమున కూర్పబడ వలెను.

తే. అంఘ్రితుది ప్రాయి డావలి యక్షరంబు
గురవయినఁ బ్రాస మొక్కఁ యక్కరమె యగును,
గాక లఘువైన వర్ణ యుగ్మంబు నడుచు
స్వరవిభేదంబు గాక కావ్యంబులందు. 388

అంత్యప్రాసమునకు పూర్వాక్షరము గురువయిన ఒక అక్షరము నకును, లఘువైన రెండక్షరములకును స్వరభేదము లేక వుండవలెను. తక్కిన ప్రాసములవలెగాక ఇట స్వరసామ్యము కూడ నుంటుట విశేషము.

క. నందాంగనా కుమారా
మందరగిరి ధీర దనుజ మదసంహారా
బృందావన విహారా
కందర్పాకార రాధికా శ్రీజారా. 389

ఇది గురుపూర్వకమైన ఏక వర్ణప్రాస. చివరివర్ణములన్నియు 'రా' వర్ణములు పూర్వాక్షరము గురువును అగుట గ్రాహ్యము.

క. గోపవధూజన మదనా
గోపాలన చతుర కుంద కుట్మల రదనా
గోపారి విజిత కదనా
గోపతి వాహాప్త ధవళ గోసమవదనా. 390

లఘుపూర్వక ద్వ్యక్షరప్రాస. చివరి రెండక్షరములు నాల్గు పాదము లందును 'దన'.

## 7. అనుప్రాసము

ప్రాసాక్షరము తొలినుండి చివరి వఱకు పలుమార్లు ఆవృతి పొందిన అది అనుప్రాసము. దీనికే వృత్త్యను ప్రాసమనియు పేరు.

క. నందసుత పురందర ముఖ
బృందారక వంద్య దాస బృందావన గో
విందయన ననుప్రాసం
బందంబగు నెందుఁ గృతుల యందు ముకుందా. 391

ఇందు బిందు పూర్వక దకారము పలుమారులావృత్తి పొందినది.

క. వడులకుఁ ప్రాసంబులకును
విడువక చెల్లుబడులెల్ల వివరించితిఁ బా
ల్పడి వీనిలోన సత్కవు
లొడఁబడి కావలసినవి ప్రయోగింపఁదగున్. 392

వళులకును, ప్రాసములకును చెల్లుబడియగు లక్ష్య లక్షణముల నన్నిటిని వివరించితిని సత్కవులు వానిలో కావలసినవాని స్వీకరించి ప్రయోగించుకొనవచ్చును.

### మత్తేభవృత్త కందగీత గర్భ సీసము

సీ. వినయ సంపన్న రవి ప్రభూత రమణీ
నాథా ప్రమోదేక్షణా నతాప్త
విభయదాకార హా విర్భగాయుత రిపు
ప్రాణానిలాహీశ్వరా రమేశ

విలయ కాలానల విక్రమప్రథిత సా
ల్వాగ్రావ వృద్ధశ్రీ వా వరేణ్య
విజయశీలా యదు వీర కౌస్తుభధరా
చక్రీ యశోదాత్మ జా ముకుంద

తే. కరివరద పూతనాంతక గరుడగమన
సత్త్వసహిత కామజనక శంకరనఖ
కనకవసన సుందరదేహ వనధిశయన
సనకముని వినుత చరణ సరసిజయుగ. 393

చిత్రకవితారీతులలో గర్భకవిత్వ మొక రీతి. ఒక పెద్ద పద్యమున ఒకటిగాని, రెండుగాని చిన్న పద్యములను ఛందోబద్ధముగ కూర్చి చిత్రముగా చెప్పుట చిత్రకవితారీతి.

పై సీసపద్యమున తొలినాల్గు పాదములందును మత్తేభ వృత్తమును, ఎత్తుగీతియందు కంద పద్యమును గర్భీకరించబడినది. ఆ పద్యములు ఇదిగా చూతము.

గర్భ మత్తేభము

నయసంపన్న రవిప్రభూత రమణీ నాథా వతూ జేక్షణా
భయదాకార హవిర్భుగాయత శిపు ప్రాణానిలాహీశ్వరా
లయకాలాన విక్రమ ప్రథిత సా ల్వాగ్రాప వృద్ధశ్రీవా
జయశీలా యదువీర కౌస్తుభధరా చక్రీయశోదాత్మజా 394

పై సీసపద్యమున నాల్గు పాదములందును తొలి అక్షరమును, చివరి మూడక్షరములను తొలగించిన ఆదిమ త్తేభ విక్రీడితమైనది అట్లు తొలగించుట వలన అర్థము చెడలేదు. ఛందోనియమముల (యతిప్రాసలు, గణ

క్రమము)కు భంగమురాలేదు. క్రొత్త పద్యమువలెనే వుండుట గర్భ పద్య లక్షణము.

## గర్భకందము

క. కరివరద పూతనాంతక
 గరుడగమన సత్త్వసహిత కామజనక శం
 కరనఖ కనకవసన సుం
 దరదేహ వనధిశయన సనకముని వినుతా. 395

ఎత్తు గీతిలోని చివరి 'చరణసరసిజయుగ' తొలగించిన కంద పద్యమగుచున్నది. కందము తుది అక్షరము గురువుకావలయునుగాన దీర్ఘ మైనది. ఇది గర్భ కవిత్వమున అంగీకారమే.

## గద్యము

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజసగోత్ర కామెపల్లి పురమందిర
నందనందన చరణారవింద వందనాభిలాష మనీషాప్రాభవ
వేంగనార్యతనూభవ విద్యావిశేష సురాచార్య
కాకుమార్యప్పకవివర్య విరచితంబైన
యాంధ్రశబ్దచింతామణియను
వ్యాకరణశాస్త్రంబునందు వళిస్వరూపంబును
నేకచత్వారింశన్మఖ్య విశ్రామంబులును నగ్రాహ్యవిరామంబును,
ప్రాసలక్షణంబులును, సప్తదశప్రధాన ప్రాసనిర్ణయంబును, అప్రశస్త
ప్రాసంబులు శబ్దాలంకారనిరూపణంబునుంగల వళిప్రాస పరిచ్ఛేదంబను
తృతీయాశ్వాసము
సంపూర్ణము
శ్రీః

—:o:—

# అప్పకవి చెప్పిన యతిభేదములు

## (I) స్వరయతులు 7

### 1. స్వరమైత్రి వళి :

అ, ఆ, ఐ, ఔ—ఇ, ఈ, ఋ, ౠ, ఎ,ఏ—ఉ, ఊ, ఒ, ఓ

వర్గాక్షరములన్నియు తమలోతాము పై స్వరములతో కూడి మై నందును.

### 2. స్వరప్రధాన వళి :

సంధిగత పదములో పరపదాది స్వరమునకు యతిమైత్రి కూర్పు

ఇన తనుభవమిత్ర లంకేశ....(లంక+ఈశ) ఛైత్ర. పరప స్వరమునకు యతి.

### 3. లుప్త విసర్గక స్వరవళి :

విసర్గకు అకారము పరమగునపుడు ఓకారము వచ్చినను పరస్వ ముతో యతి కూర్చుట.

అంబుదశ్యామతవకింకరోహమనగ (కింకరస్+అహమ్) ప పదాది అకారమునకు యతి.

### 4. ఋవళి :

రి,రీ,రె,రేలకు ఋ,ఎలతో యతికూర్చుట

ఋత్విజుండని విచారించి పూజించితే

### 5. ఋత్వసంబంధవళి :

ఎ (వ్రటుసుడి)కి ఇ,ఈ,ఋ,ౠ,ఎ,ఏలతోను ఈ అచ్చులుగల య, హలతోను యతి కూర్చుట.

ఇనతనూభవుండు వృష దళ్వసుతునేపె

### 6. ఋత్వసామ్యవళి

ఋకార సామ్యముచే అన్ని హల్లులకు యతి మైత్రి కూర్చుట.

మృతువిఁగావించెఁ గంసువిఁగృష్ణుడనగ

**7. వృద్ధివళి :**

వృద్ధి సంధిలో పరాచ్చు ఏ,ఓలతోగాని, ఆదేశ ఐ,ఔలతోగాని యతి కూర్చుట.

ఇభభయ విదార స్వరలోకైక వీర(లోక+ఏక)
అఖిల భువన ప్రశస్త జితైణ హస్త (ఐ)

**(II) వ్యంజనాక్షరయతులు :**

**1 ప్రాణియతి :**

ఏ హల్లునకు ఆ హల్లు స్వరమైత్రితో కూర్చుట.

కలశాబ్ధి గంభీర కాంచనాచలధీర
భువనజాధీశ యంభోజనేత్ర

**2 వర్గజయతి :**

అనునాసికము వాడిన వర్ణాక్షరములు తమలో తాము మైత్రినందుట.

కంధి మధ్యగేహ ఖండితారి సమూహ
చంచరీక నేత్ర జలజాతనిభగాత్ర

**3 బిందుయతి :**

వర్ణాక్షరములు బిందు పూర్వములై తమ అనునాసికముతో చెల్లుట.

జ్ఞాన సంధాత్రి స్వచ్ఛ కాంచన సుగాత్రి
మనసి జాతాయ గోపడింభాయయనగ

**4. తద్భవ వ్యాజయతి :**

ఆజ్ఞప్తి-ఆనతి అగుటచే జ్ఞ-న-ణ పరస్పరమిత్రములగుట

జ్ఞానిచే తోంబుజాత శోణకరయనఁగ

23)

**5 విశేషవళి :**

జ్ఞకు క,ఖ,గ,ఘలతో యతి కూర్చుట

జ్ఞానికి నుపదేశవిధి ప్రకాశము సేయన్

**6 అనుస్వార సంబంధయతి :**

బిందుపూర్వక (ంట) టవర్గమునకు బిందుపూర్వక (ంత) తవర్గ మునకు యతి కూర్చుట

(కు)ంద్ర విభగాత్రి పాదంబులంట మదితలంచి

**7 అనునాసికాక్షరయతి :**

'న'కు బిందుపూర్వక ట వర్గముతోను, 'ణ'కు బిందుపూర్వక త వర్గముతోను యతికూర్చుట.

ణాకువిట నాల్గుచెల్లు కంద ర్పజనక

నకుల సహదేవులార ఖండన పటిష్ఠ(లార)

**8 ఋవిభక్తియతి :**

విభక్తి ఋకారమునకు పృ,పు, బు,భులతో యతి కూర్చుట

పుష్కరము సూక్ష్మమధ్యమముగ నొనర్చె

బొండుమల్లెలు దరహాసముగ నొనర్చె

**9 ఋకారయతి :**

సహజ ఋకారమునకు పృ,పుబు,భులతో యతి కూర్చుట

ము త్తెపురుల్లరులతోడి బుట్టటకొమ్మల్

**10 ఋవర్ణయతి :** బిందుపూర్వక అంతస్థ, ఊష్మములకు మకార ముతో యతి కూర్చుట

మారుతాత్మజుడరిది సంయమియనంగ

మదన జనకుఁడు దనుజ సంహారుఁడనఁగ

**11 ఋజుయతి :**

య-హ వర్ణములకు పరస్పరము యతి చెల్లుట.

హారముఖార్చిత పాదతో యజయనంగ

**12 ప్రత్యేకయతి :**

అది, అపి శబ్దముల అకారము సంధి వశమున లోపించిన హల్లు తోను, లోపింపకున్న అచ్చుతోను యతి.

దివ్య చాపంబు శూలి చేతి ది యనంగ

అర య శార్ఙ్గంబు హరి చేతి యదియనాగ

**13 భిన్నయతి ; పెఱయతి**

ఇంచు గాగమమునడుమ ఇకారమువచ్చిన ఇకార సవర్ణాచ్చులతోను లేకున్న రివర్ణముతోను యతి కూర్చుట.

ఎదను లచ్చివి హరి ధరియించెననగ

రిపులనెల్లను చీరహరించెన నంగ

**14 ఏకతరయతి :**

లఘు-అలఘురేఫములు (ర-ఱ) పరస్పరమైత్రి పొందును.

రార బాలకృష్ణ రచ్చలగమి గూడి

**15 అభేదయతి :**

వ-బ, ల-డ, ల-శలకు అభేదత్వమున యతి చెల్లును.

వసుమతీకళత్ర బకజైత్రగాత్ర

**16 అభేదవర్గయతి :**

వకారమునకు 'బ'తోనేగాక ప,ఫ,భలతో కూడ యతి చెల్లుట

పరమపావని గాయత్రి వందనములు

**17 ఊష్మయతి :**

శ, ష,స మూడు పరస్పరము యతికి చెల్లును.

శతమఖోసల భూతానుషంగ శ్రీనంగ

**18 సరసయతి :**

అ-య-హలకు, శ,ష,స—చ,ఛ,జ,ఝలకు, న-ణలకు యతి చెల్లును.

**19 సంయుక్తయతి :**

సంయుక్తాక్షరములతో ఏదేనొక హల్లునకు యతి కూర్చుట క్ష్మ—క,ష,మ (ఏదైన చెల్లును)

**20 అంత్యోష్మసంధియతి :**

వాక్+హరి—వాగ్ఘరి క,హలతో యతి చెల్లును.

**21 వికల్పయతి :**

అనునాసిక సంధియందు ఉభయ హల్లులను యతికూర్చుట సత్+మతి—సన్మతి త-న.

**(III) ఉభయయతులు ;**

కేవల స్వరమునకుగాని, కేవల వ్యంజనమునకుగాని యతి కూర్చుట ఉభయ యతులందు స్వరవ్యంజనోభయ మైత్రి చెల్లును.

**1. యుష్మదస్మచ్ఛబ్దయతి**

యుష్మద్ అస్మద్‌లకు సంధి రూపము అచ్చునకుగాని హల్లునకుగాని యతి కూర్చుట.

అతిపావన మయ్యె న న్మదన్వయ మెల్లన్

ధర్మతనయ యుష్మదాజ్ఞ వినక విని

**2 పరరూపయతి**

శకంధు, కర్కంధు, కుద్దాలాదులందు ఉభయయతి.

**3 ప్రాదియతి**

పరా, అజ్, అపి కాక మిగిలిన ఉపసర్గ యోగముకల శబ్దములకు ఉభయయతి.

**4 నిత్యసమాసయతి**

జనార్ధన, నారాయణ, కర్ణాటాది నిత్యసమాసముల కుభయయతి.

**5 దేశ్య నిత్యసమానయతి**

రూపఱు, క్రచ్చఱ, క్రిక్కిఱియు ఆదిదేశ శబ్దములకు భయయతి.

**6 నిత్యయతి**

ఏవిశబ్దసంధిలో అచ్చునకుగాని, హల్లునకుగాని యతి.

**7 రాగమసంధి**

రుగాగమ సంధిలో ఉభయయతి (పేదరాలు-పేద+ఆలు)

**8 విభాగవళి**

ఏసి శబ్దసంధిలో ఉభయయతి (నాలుగేసి)

**9 నామాఖండయతి**

అన్న, అమ్మ ఇత్యాదుల సంధియం దుభయయతి (రామన్న,సీతమ్మ)

**10 పంచమీ విభక్తియతి :**

కన్నన్, కంటెన్ శబ్దములు అన్నన్, అంటెన్‌వలె వినబడుటచే ఉభయయతి.

**11 కాకుస్వరయతి :**

దూతాహ్వానాదులందలి తుదిదీర్ఘమునకు ఉభయయతి (రామా -మధి.)

**12 ప్లుతయుగయతి :**

హల్లైత్రిలేకున్నను ప్లుతసామ్యముచే యతి.

(సీ)వై గతి కావవే రఘుపతే శరణాగత వజ్రపంజరా

**IV ప్రాసయతి :**

1 గీత సీస పద్యములందు యతికి బదులుగ ప్రాసయతి కూర్చుట.

**అప్పకవి చెప్పిన ప్రాసభేదములు 17**

1 అర్ధబిందు సమప్రాస–వీఁక-తాఁకి (అరసున్న ప్రాస)

2 పూర్ణబిందు సమప్రాస-ఇందీ-నంద

3 ఖండాఖండప్రాస : బోటి-పాట, తీగ-నాగ (అరసున్న కలిగినవాని ప్రాస)

4 సంయుతాక్షర ప్రాస : పక్ష్మ-సూక్ష్మ (ప్రాసలో సంయుక్తాక్షరము)

2 సంయుతాసంయుతప్రాస : ల ర సంయుక్తాక్షరములు సంయుక్తము లేకున్నను చెల్లుట.

6 రేఫయుత ప్రాస : క్రారవదులకే ప్రాస, వజ్రసుదులతో క్రావదులను కలుపరాదు.

7 లఘుద్విత్వప్రాస : సంయుక్త పూర్వాక్షరములు లఘువులగుచో వానికే గూర్చుట (అద్రుచు, విద్రుచు)

8 వికల్పప్రాస : సానునాసికములైన తృతీయా పంచమములకు ప్రాస.

9 ఉభయ ప్రాస : న-ణలకు, న-షలకు ప్రాస (ప్రాణదాన)

10 అనునాసిక ప్రాస : పూర్ణబిందుపూర్వక న,మలకుద్విత్వయుక్త న,మలకు ప్రాస.

11 ప్రాసమైత్రిప్రాస : పూర్ణబిందు పూర్వక బకారమునకు ద్విత్వ మకారమునకు ప్రాస.

12 ప్రాసవైరము : సాధురేఫ, శకట రేఫములకు ప్రాసలేదు.

13 స్వవర్గజప్రాస : థ-ధ, ద-ధలకు ప్రాస.

14 ఋప్రాస : ఋకారమునకు-రేఫకు ప్రాస (అ ఋషి-చేరి)

15 లఘుయకార ప్రాస : లఘ్వలఘు యకారములకు ప్రాస.

16 అభేదప్రాస ; ల-ళ-డలకు ప్రాస.

17 సంధిగతప్రాస : సంధిగత వర్ణములకు-సహజ వర్ణములకు ప్రాస.

దివిజులాశ్చర్యమంద శౌరి వడవైచె (శౌరి+వడవైచె)

# యతిప్రాసముల వైశిష్ట్యము

'యతి' సంస్కృత శబ్దము. దానికి తెలుగు 'వడి' 'వళి' యతి, విరతి, విరమణము, వడి, వళి అను పర్యాయపదములుగ లాక్షణికులు పేర్కొనిరి. కాని 'ఆద్యోవళికి' అను ఆంధ్ర శబ్దచింతామణి సూత్రమునకు అనువాదముగ తెలుగు లక్షణ గ్రంథకర్తలు.

| | |
|---|---|
| కవి జనాశ్రయము | చరణాద్యక్షర మేవడి |
| కావ్యాలంకార చూడామణి | పాదప్రదమాక్షర ముత్పాదిత సుగువళియనంగ |
| ఛందోదర్పణము | వానసగల మొదలిక్రయి వడియనఁబరగున్ |
| అప్పకవీయము | చరణ చరణమున కాద్యక్షరములు వళులయ్యె |

అని వడి, వళి అనియే పేర్కొనిరిగాని యతి,విరతి, విరమణము అను పదములు పేర్కొనలేదు.

సంస్కృత శ్లోకములలో విశ్రాంతి ప్రధానము, ఖండాద్యక్షర మైత్రి కావలెనన్న నియమము లేదు. తెలుగు పద్యములలో ఖండాద్యక్షర మైత్రి ప్రధానము. పాదము ముగియవలె (విశ్రాంతి) నన్న నియమము లేదు. సంస్కృతలాక్షిణికులు వృత్తములలోఎక్కడెక్కడ విశ్రాంతి ఉండవలెనని చెప్పిరో తెలుగు పదములలో ఆయా స్థలములందే సాధారణముగా వడి నియమము పాటింపబడుచున్నది. అక్షరావృత్తిలోనున్న సొగసు పద విచ్ఛేదమున కనబడదు. కావుననే తెలుగున శ్రుతి సుఖమునకై యతిప్రాసములు, కల్పింపబడినవి.

కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో ప్రావళ్ళ (ప్రాసములు. వళులు)చేతనే తెనుగు కవికి నొక వన్నె చేకూరెనని పేర్కొని నాడు. 'మధురతా నిమిత్తం యతిరిష్యతే' మాధుర్యముకొఱకు యతి కోర

బడుచున్నది-అవి కవి కల్పలత యతి ప్రాశస్త్యము నుగ్గడించినది. అప్ప కవి 41 యతిభేదముల నెఱింగించెను.

పద్యమునందలి ప్రతిపాదమునందును రెండవ అక్షరము ప్రాసము అనబడును. అప్పకవి ఏడు ప్రాసములను తెలిపెను. సంస్కృతమున ఈ ప్రాసనియమముకూడ లేదు. 'తల్లి' సంస్కృతము సమస్త భాషలకు అని చెప్పబడినను తొలుతనుండియు తెలుగుభాష సంస్కృత భాష, సాహిత్యప్రభావమున పరిపుష్టమై తత్సమ పదబహుళమై సంస్కృత కావ్యా లంకారరీతులను ఏమాత్రము మార్పులేకుండ గ్రహించినప్పటికిని చందో వ్యాకరణములందు మాత్రము కొంత స్వాతంత్ర్యము వహించుట విశే షము. అందున సంస్కృతమున లేని యతి ప్రాస నియమములు తెలుగున నిర్బంధములగుట మరీ విశేషము, ఒక ప్రత్యేకత, ఒక వైలక్షణ్యము భాషకు విశిష్టతను చేకూర్చును. యతిప్రాస నియమము ఇంచుకము వదల బడిన నన్నయ నాటినుండి నేటివఱకు వ్రాయబడు రసవంతములగు కావ్య ములన్నిటియందు గ్రహింపబడుట తెనుగుభాష విశిష్టతకాక ప్రత్యేకత ఆంధ్రభాషాయోషకు యతిప్రాసములు మంగళసూత్రములంటివి. కవి బ్రహ్మ తిక్కన ఈ వళిప్రాసములను విమర్శించువారివిగూర్చి

తెలుగుకవిత్వము చెప్పం, దలఁచిన కవి యర్థమునకుఁ దగియుండెడు మా
టలు గొని వళులుం బ్రాసం, బులు నిలుపక మొగివి బులిమిపుచ్చు చదురే

అని బుద్ధి పెప్పెను. కూచిమంచి జగ్గకవి వడిప్రాసములులేని కవిత వ్రాయువాడు 'కాకవి' అని పేర్కొనెను. మార్గకవిత నెదిరించి దేసి కవి తమ తన మార్గముగ చెప్పిన పాల్కురికి సోమనయు దేసిగా విరచించు ద్విపదకు వళ్ళు ప్రాసంబులును బొందువడఁదాపవలయు'ననెను.

వ్యవహారమున భాషాస్వరూపము మారుచుండును. ఇది జీవభాషకు సహజమే. అట్టిసమయమున శబ్దస్వరూపము నిర్ణయించుటకు యతిప్రాసములే చక్కనిసాధనములు. విజయమునకు తెలుగుభాషకు వళి ప్రాసములు సహజసిద్ధములైన అమూల్యాలంకారములు. అంతియేకాదు శ్రవణసుభగములును అగుట అనుభవసిద్ధము. తెలుగు కవితకున్న మాధుర్యగాంభీర్యములు ఇతర భాషాసాహిత్యములకు లేదనుట సాహసోక్తికాదు. జానపదుల పాటలయందును, తెలుగు సామెతలందును ఈ వళిప్రాసములు ఆధిపత్యమునందినవన యతిప్రాసల ప్రయోజనమునుగూర్చి వేరేమి తెల్పవలెను.

కలిమిలేములు కావడికుండలు
పేదవానికోపము పెదవికిచేటు
అంగడిలో అన్నీ ఉన్నా అల్లుడినోట్లో శని
నరకమెక్కడ నాగలోకం ఎక్కడ

దీనినిబట్టి తెలుగుభాషలోని యతిప్రాసముల వైశిష్ట్యమును గ్రహించి బాలబాలికలు చక్కని ప్రవేశము సాధించి చిక్కని కవితలల్లు సమర్థులగుదురుగాక.

# అప్పకవి చెప్పిన యతిప్రాసముల పరామర్శనము

కాలాను గుణమున గ్రంథ సంఖ్య పెరుగుటలో ప్రయోగ వైవిధ్యమును పెరుగు చుండును. దాని ఆధారముగ యతిభేదసంఖ్య పెరుగుటయు సహజము. ఈ కారణముననే భీమన - కవి జనాశ్రయమున 10 యతులును, అనంతుడు ఛందో దర్పణమున 24 యతులును, చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహమున 27 యతులును చెప్పగా అప్పకవి 41 యతి భేదములను పేర్కొనెను. ఇవి అన్నియు అవసరములా? అనిన కొన్ని అవసరములుగను, కొన్ని ఒక దానినే రెండు మూడు యతి భేదములు చేయుటయు, కొన్ని స్పష్టత కొఱకు చేయబడినవియు నగుచున్నవి.

అప్పకవి 7 స్వరయతులు, 21 వ్యంజన యతులు, 12 ఉభయ యతులు, ప్రాస యతి మొత్తము 4 ప్రధాన భేదములుగా 41 యతి భేదములను చెప్పియున్నారు.

భీమనాదులు ప్రత్యేక భేదముగ తెలుపని స్వర ప్రధానవడిని అప్పకవి తెల్పెను. అప్పకవి తెల్పిన లుప్త విసర్గక స్వర వళిని అనంతుడు గూఢస్వరయతి అన్నాడు. విసర్గలుప్తమై ఓ కార మాదేశమై పరస్వరము గూఢముగా నుండుటచే గూఢస్వర యతియే సమంజసమనిపించును. అప్పకవి ఋత్వసామ్యవళి క్రొత్తగా చెప్పుట స్పష్టత కొఱకే. అనంతుడు ఋవళి, ఋత్వ సంబంధవళి రెండు మాత్రమే చెప్పెను.

ఇక వ్యంజన యతులలో ప్రాణియతి పూర్వలాక్షణికు లెవ్వరును పేర్కొనలేదు. సరస యతిచే న- ణలు, బిందు యతిచే న, ణలకు బిందు పూర్వక ట, క వర్ణాక్షరములు చెల్లుట ద్వారా బిందుపూర్వక ట, త వర్ణాక్షరములు పరస్పరము మిత్రములగుటకు అవకాశము కలుగుచున్నది. అట్టియెడ అనునాసికాక్షరయతి, అనుస్వార సంబంధ యతి వేరువేరుగా చెప్పుటకావశ్యకత కనబడదు. ము విభక్తి యతి, ముకార యతి వేరుగా

చెప్పబని లేదు. రెంటిని కలిపి చెప్పిన ప్రయోజనము చేకూరును. అభేద యతి, అభేదవర్గ యతి విషయమునకు ఒక్కటే యే చాలును. రెండు చెప్పబడనక్కఅలేదు. ఋజు యతి, ఊష్మ విశ్రాంతి యతి అవసరము కనబడదు. రెండును సరసయతి చేతనే సుసాధ్యములు. ప్రత్యేక యతి, భిన్నయతులకు ప్రత్యేకముగా పేర్కొనుటలోని ప్రయోజన మగుపడదు. ఆ రెండును పూర్వ యతులచే సాధ్యములే. ర - అ లకు యతి అప్పకవి అంగీకరింపలేదు. అది స్పష్టపరచుటకే ఏకతర యతి చెప్పెను. అభేద యతి, అభేద వర్గయతి రెండుగా చెప్పబడనక్కరలేదు.

ఇక ఉభయవళులలో అఖండవడి నంగీకరించిన అప్పకవి చెప్పిన 12 భేదములు చెప్పబడనక్కరలేదు. అందుకు అనవసర భేదములను అప్పకవి కొన్ని చెప్పినాడనిపించును. నిత్యసమాసయతి, దేశ్య నిత్య సమాసయతి రెండు చెప్పబనిలేదు. కలిపి ఒక్కటిగా చెప్పిన చాలునని పించును. అట్లే కా కుస్వరవళి, ప్లుతయుగ విశ్రామము రెండు చెప్పబని లేదు. ఒకటి చాలును.

అప్పకవి చెప్పని యతి భేదములు ఇంకను పలుగ్రంథములందు కనబడుచున్నవి. అందు ఞ వడి ఇత్యాదులు కలవు. విద్యార్థినీ విద్యార్థు లకు సుకర బోధములగుటకై అప్పకవి ఇన్ని యతి భేదములు తెల్పె ననుట నిస్సంశయము. ఆయినను కొన్ని అనవసరములే యనిపించుటయు సత్యము.

అట్లే ప్రాసములందును అర్థబిందువు, పూర్ణబిందు, సంయుక్తాక్షర ప్రాసములు మూడును సమప్రాస ఒక్కటితో సమసిపోవును. సంయుతా సంయుత ప్రాస చెప్పినాడు గాన రేఫయుత ప్రాస అనవసరము. వికల్ప ప్రాసము అనవసరము. స - శ లకు, ల - ద లకు, ల - ర లకు ప్రాస నంగీకరింపవలెగాని అప్పకవి చెప్పలేదు గాన అంగీకారము కాదనుకొన వలెను.

## అప్పకవి - అఖండయతి - ఆవశ్యకత

ప్రాదియతి నిత్య సమాస యతి మొదలగు ఉభయ యతు లందుఁ జేరని స్వరసంధి ఘటిత పదములందు సంధ్యక్షరమునకు హల్లుతో యతి మైత్రి చేయుట అఖండ యతి. కవిజనాశ్రయకర్త అఖండయతి నంగీకరించెను. అనంతుడు ప్రత్యేకముగా పేర్కొనక పోయినను కొన్ని స్థలములందు మాత్రమే అంగీకరించెను.

నిత్యసమాస యతినే అనంతుడు అఖండ యతిగా పేర్కొనెను. అప్పకవి మాత్రము అఖండ యతినంగీకరింపలేదు. ఆ కవి మనమున అఖండయతి నంగీకరించిన స్వరసంధిగల తెలుగు, సంస్కృత శబ్దములకన్నిటికిని స్వరమునకేకాక, వ్యంజనమునకును యతి నంగీకరింపవలెననునదే అభ్యంతరము. (రాముడతడు (డ) వంశాబ్ధి (శ)) ఇత్యాది తెలుగు, సంస్కృత శబ్దములందు వ్యంజన మైత్రి అంగీకరింపవలసి వచ్చుచున్నది. ఇందులకే అప్పకవి దీని నంగీకరింపదయ్యెను. అనంతుడును కొన్ని తావులందే అంగీకరించెనని చెప్పబడినది. భీమనయు అఖండయతి నంగీకరించినను ప్రాది, ప్లుత ఇత్యాది ఉభయయతి భేదములను పేర్కొనియే యున్నాడు. దీనినిబట్టి అఖండయతి క్వాచిత్కమని తప్పని పరిస్థితులలో మాత్రమే ప్రయోగార్హమని చెప్పుకొనవలెను.

అప్పకవి అఖండయతి సమ్మతము కాకపోవుటచే ఉభయ యతి భేదములను పేర్కొనెను. కవిత్రయము అఖండ యతి నంగీకరింపలేదని భారతమునందు కనపడు అఖండయతులన్నియు లేఖక పాఠకులచే దిద్ది వేయబడినవని అప్పకవి అభిప్రాయము.

అఖండవడి ప్రయోగములు ప్రాచీన, అర్వాచీన గ్రంధములను పెక్కులు కనబడుచున్నవి. అప్పకవి దిద్ది చెప్పిన భారతమునందలి ప్రయోగములన్నియు సమంజసములుగా కనబడుటలేదు. అఖండయతి నంగీకరించుటయే సమంజసముగా కనబడుచున్నది.

—)0(—